17

# వీక్షణం


ఆర్థిక, సామాజిక పక్షపత్రిక

సంపుటి: 1 సంచిక: 2
అక్టోబర్ 1-15, 2003

సమతా పబ్లికేషన్స్ ప్రచురణ

పేజీలు: 24
వెల: రూ.5-00




లోపలి పేజీల్లో...




వార్షిక చందా రూ॥ 120/-లు


సంపాదకీయం:

## ఈ హింసా వలయానికి మూలమేమిటి?

**ముఖ్యమంత్రి** చంద్రబాబునాయుడును తుదముట్టించడానికి తిరుమల రహదారిపై పీపుల్స్‌వార్ పేల్చిన మందుపాతర విస్తృత రాజకీయ సంచలనానికి దారితీస్తుంది. ఒకటికిరెండు విచారణ కమీషన్లు, దేశదేశాల రాజకీయనేతలు పారిశ్రామిక అధిపతులు ప్రకటిస్తున్న పరామర్శలు పత్రికలనిండా వెల్లువెత్తుతున్న వార్తలు అన్నీకూడా రోగలక్షణాల మీద చాలా మాట్లాడుతున్నాయి. కాని వ్యాధి కారణమేమిటో; జరిగిన ఘటన ఏ నేపథ్యంలో ఏ కారణాల వల్ల జరిగే అవకాశం వుందో ఆ నేపథ్యాన్ని ఆ కారణాలను తొలగించడం ఎలాగో చర్చించడంలేదు. ఎవరైనా ఆ ప్రస్తావన తెచ్చినా వాళ్ళమీద విరుచుకుపడుతున్నారు. వ్యాధిని నయం చేయాలంటే లక్షణాలకు మందుఇస్తే సరిపోదని, మూలకారణాన్ని కనిపెట్టి అవసరమైన చికిత్స చేయాలని సాధారణ లోకజ్ఞానం. తిరుమల మందుపాతర సంఘటన ఈ సాధారణ లోకజ్ఞానాన్ని అదృశ్యం చేసినట్టే.

మందుపాతర ఘటన తర్వాత, కొట్టవచ్చినట్టు బయటపడిన అంశాలు మూడు. వాటి గురించి చర్చించడం, ఆ చర్చ ఫలితంగా సరైన విశ్లేషణ జరిపి అవసరమైన చర్యలు తీసుకోవడం అటు పాలకులకు ఇటు మొత్తంగా తెలుగుసమాజానికి కూడా అత్యవసరం.

మొదటిది ఘటన తరువాత వెలువడిన ప్రజాస్పందన. చాలా ఆశ్చర్యకరంగా సామాజిక స్థాయిలో సద్యోజనితంగా ప్రజాస్పందన ఊహించినదానిలో శతాంశమైనా లేదు. జర్మనీ అధ్యక్షుడి నుంచి బహుళజాతి సంస్థల సి.ఇ.ఓ.ల నుంచి చోటోమోటా రాజకీయనాయకుల దాకా దిగ్భ్రాంతి ప్రకటించడం పరామర్శించటం సరే. మామూలు ప్రజల మాటేమిటి?

వాళ్ళ ప్రతిస్పందన ఎక్కడైనా చిన్నస్థాయిలోనైనా నమోదైందా? పత్రికలు సంపాదకీయాలు విశ్లేషణలు రాసినమాట నిజమే. మందుపాతర పేల్చినవారిని శాపనార్థాలు పెట్టినమాటా నిజమే కాని గతంలో నాయకులమీద దాడులు జరిగినప్పుడో, నాయకుడు సహజమరణం పొందినప్పుడో ప్రజలలో కనిపించిన స్పందన ఇప్పుడెక్కడైనా వుందా? అన్ని ప్రజావర్గాల నుంచి ఆయన దూరం అయిపోయాడనడానికి ఈ మౌనం ఒక సూచన కావచ్చునా? ఆ వర్గాలు ఆయన మరణాన్ని కోరుకోకపోవచ్చు. కాని ఇంత ఘటన జరిగినా పట్టించుకోకుండా ఉండడం దేనికి సూచన?

రెండోది. చంద్రబాబునాయుడు ఎనిమిదేళ్ళ పాలనాకాలం అటు ప్రపంచబ్యాంకు ఆదేశాల మేరకు పాలనను నడుపుతూ ప్రభుత్వం సంక్షేమ స్వభావాన్ని పూర్తిగా రద్దుచేసిన చరిత్ర సాయుధ ప్రజా ఉద్యమాలమీద మాత్రమేకాదు. ప్రభుత్వం అంగీకరించిన కోరికలను తీర్చమని అడిగిన అంగన్‌వాడి కార్యకర్త నుంచి అన్ని బృందాలమీద దాడిచేయడానికి నోరు నొక్కడానికి పోలీసుబలగాలకు పూర్తి స్వేచ్ఛనిచ్చిన చరిత్ర. ఈ ఘటనకు పాల్పడిన పీపుల్స్‌వార్ తన ప్రకటనలో పేర్కొన్నట్లు ఈ ఎనిమిదేళ్ళ కాలంలో ఆ పార్టీ కార్యకర్తలు 14 వందలమందిని పోలీసులు కాల్చిచంపివేశారు. ఇతర పార్టీల కార్యకర్తలను కూడా కలుపుకుంటే ఈ సంఖ్య 2 వేలకు చేరుతుంది. కనుక ఇటువంటి పాలన ద్వారా భిన్నాభిప్రాయాన్ని భౌతికంగా నిర్మూలించాలని ప్రభుత్వం ప్రతిన బూనింది. ఇలాంటి అనాగరిక నిర్ణయానికి నక్సలైట్ల నుంచి ఎటువంటి ప్రతిస్పందన వస్తుందో ప్రభుత్వానికి తెలియదనుకోగలమా?

మూడవది ఈ నేపథ్యంలో హింసా ప్రతిహింసా చర్చ చేయనవసరం లేదు. ఎవరిది ఎంత హింసో కూడా అంకెలు ఏకరువు పెట్టనవసరం లేదు. ఈ హింసావలయాన్ని ఆపడానికి కనీసం తగ్గించడానికి ఒక అవకాశం చర్చల సందర్భంలో వచ్చింది. స్వయంగా ఈ ప్రభుత్వమే ఆ చర్చలను భగ్నం చేయడానికి పోలీసులు ప్రయత్నిస్తే ఈ ప్రభుత్వమే మౌనం వహించింది. అంటే హింస కొనసాగాలని తామే ఒక రాజకీయ నిర్ణయం తీసుకున్న తర్వాత జరగబోయే పరిణామాలకు ప్రభుత్వమే బాధ్యత వహించవలసివస్తోంది.

## రాష్ట్ర ప్రభుత్వాల లోటు

(కోట్లలో)

| | ద్రవ్యలోటు | | ప్రాథమిక లోటు | |
|---|---|---|---|---|
| | స్థూలం | నికరం | స్థూలం | నికరం |
| 1990-91 | 18787 | 14532 | 10132 | 8280 |
| 1991-92 | 18900 | 15746 | 7956 | 10123 |
| 1992-93 | 20892 | 15770 | 7681 | 6497 |
| 1993-94 | 20596 | 16263 | 4795 | 5188 |
| 1994-95 | 27697 | 23507 | 8284 | 9459 |
| 1995-96 | 31426 | 26695 | 9494 | 10556 |
| 1996-97 | 37251 | 33460 | 11675 | 16055 |
| 1997-98 | 44200 | 39135 | 14087 | 16932 |
| 1998-99 | 74254 | 66209 | 38380 | 37814 |
| 1999-00 | 91480 | 79309 | 46309 | 43431 |
| 2000-01 | 89532 | 84698 | 37830 | 44434 |
| 2001-02 తాత్కాలికం | 95986 | 91439 | 33497 | 38145 |
| 2002-03 (స.అం.) తాత్కాలికం | 116730 | 102902 | 42584 | 37626 |
| 2003-04 (బ.అం.) తాత్కాలికం | 108861 | 97395 | 26573 | 24339 |

## స్థూల జాతీయాదాయంలో శాతం

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1990-91 | 3.3 | 2.6 | 1.8 | 1.5 | 0.9 |
| 1991-92 | 2.9 | 2.4 | 1.2 | 1.5 | 0.9 |
| 1992-93 | 2.8 | 2.1 | 1.0 | 0.9 | 0.7 |
| 1993-94 | 2.4 | 1.9 | 0.6 | 0.6 | 0.4 |
| 1994-95 | 2.7 | 2.3 | 0.8 | 0.9 | 0.6 |
| 1995-96 | 2.6 | 2.2 | 0.8 | 0.9 | 0.7 |
| 1996-97 | 2.7 | 2.4 | 0.9 | 1.2 | 1.2 |
| 1997-98 | 2.9 | 2.6 | 0.9 | 1.1 | 1.1 |
| 1998-99 | 4.3 | 3.8 | 2.2 | 2.2 | 2.5 |
| 1999-00 | 4.7 | 4.1 | 2.4 | 2.2 | 2.8 |
| 2000-01 | 4.3 | 4.0 | 1.8 | 2.1 | 2.5 |
| 2001-02 తాత్కాలికం | 4.2 | 4.0 | 1.5 | 1.7 | 2.6 |
| 2002-03 (స.అం.) తాత్కాలికం | 4.7 | 4.2 | 1.7 | 1.5 | 2.5 |
| 2003-04 (బ.అం.) తాత్కాలికం | 4.0 | 3.5 | 1.0 | 0.9 | 1.8 |

## రాష్ట్ర ప్రభుత్వాలు – కొన్ని సూచికలు

| | 2003-04 (తా.) (బ.అం.) | 2002-03 (తా.) (స.అం.) | 2001-02 (తా.) | 1990-00 (సగటు) |
|---|---|---|---|---|
| 1. రెవెన్యూలోటు/రెవెన్యూ ఖర్చు | 12.8 | 17.3 | 18.8 | 9.3 |
| 2. రెవెన్యూలోటు/స్థూల రాష్ట్ర ఆదాయం | 45.0 | 52.5 | 61.7 | 34.8 |
| 3. అభివృద్ధి ఖర్చు/స్థూల రాష్ట్ర ఆదాయం | 9.5 | 10.0 | 9.4 | 10.2 |
| 4. అభివృద్ధేతర ఖర్చు/స్థూల రాష్ట్ర ఆదాయం | 6.5 | 6.5 | 6.0 | 4.6 |
| 5. రాష్ట్రాల సొంతపన్ను ఆదాయం/స్థూల రాష్ట్ర ఆదాయం | 6.2 | 6.0 | 5.7 | 5.3 |
| 6. రాష్ట్రాల పన్నేతర ఆదాయం/స్థూల రాష్ట్ర ఆదాయం | 1.4 | 1.5 | 1.4 | 1.7 |
| 7. సామాజికరంగం ఖర్చు/స్థూల రాష్ట్ర ఆదాయం | 6.0 | 6.0 | 5.8 | 5.7 |

తా:తాత్కాలికం బ.అం:బడ్జెట్ అంచనా స.అం:సవరించిన అంచనా

మూలం: రిజర్వుబ్యాంకు వార్షిక నివేదిక 02-03

# మన ఆర్థిక పరిస్థితి అంతా గజిబిజి

**మనదేశం** ఆర్థిక దుస్థితినుంచి బయటపడిందా? ఈ ప్రశ్నకు రకరకాల జవాబులు వినిపిస్తున్నాయి. అన్ని పారిశ్రామిక సంస్థలూ ఆశాభావాన్ని ప్రకటిస్తున్నాయి. గత సంవత్సరం 4.5 శాతానికి దిగజారిపోయిన ఆర్థిక పరిస్థితి అభివృద్ధిరేటు ఈ సంవత్సరంలో 6.5 శాతం వుంటుందని ప్రకటనలు చేస్తున్నారు. శుభం, కంటానని కోడలుఅంటే వద్దనే అత్తగార్లు వుండనట్లే (మనటివి సీరియళ్ళలో తప్ప), మనదేశం ఆర్థికమాంద్యం ఊబినుంచి బయట పడుతుందంటే అంతకన్నా హర్షించదగిన విషయమేముంటుంది. ఈ మార్పురావటానికి ప్రధానంగా వ్యవసాయరంగం పుంజుకునే సూచనలు కనిపించడమేనని వారి అభిప్రాయం. పోన్లెండి, వారు అభివృద్ధిసాధించినా, దిగజారిపోయినా అందుకు వ్యవసాయమే కారణమని గ్రహించినందుకు సంతోషం. ఈఒక్కసారేగాక, ఈ శాశ్వత సత్యాన్ని గ్రహింపులో ఎపుడూ ఉంచుకోవడం మంచిది. అంతేకాదు, ఆమేరకు వాళ్ళ లాబీ తమ పరిశ్రమాభివృద్ధికే కాదు, వ్యవసాయాభివృద్ధికి కూడా ఎల్లపుడూ ప్రభుత్వంపై వత్తిడి తీసుకొని వస్తే, వాళ్ళ ఒంటికే మంచిది. ఆశావాదులుగా ఉండడం మంచిది, అవసరం కూడా. కాని మరీ గుర్రాన్ని కళ్ళాలు లేకుండా వదిలేస్తే ఆ తర్వాత బొక్కబోర్లా పడాల్సివస్తుంది.

* * * *

మన పాలకుల విధానాలు ఒక పట్టాన మనకు అర్థంకావు. అంతా గందరగోళంగా అనిపిస్తుంది. ఒకపక్క 26 కోట్లమంది ప్రజలు తిండికి మొఖం వాచివుంటే, మరోపక్క మూడుకోట్ల టన్నుల ఆహారధాన్యాలు గోదాముల్లో మూలుగుతున్నాయి. అలాగే ఒకపక్క రోజుకూలీ దొరక్క ఇబ్బందిపడుతుంటే, రెండోపక్క సంపాదించింది ఎలా దాచుకోవాలో తెలియక, ఇంకా ఎలా సంపాదించాలి అంటూ తలలు పట్టుకుంటున్నారు. ఇపుడు భారతప్రభుత్వానికి ఆర్థిక వనరులు తగినన్ని లేక గిలగిలా కొట్టుకుంటుంటే, నిల్వలతో ఏం చెయ్యాలి అని తెగ మదనపడిపోతున్నారు. మనరాష్ట్రంలోనే చూసుకుంటే ఒకపక్క రుణభారం పెరిగి, వడ్డీచెల్లింపులు పెరిగి, తెచ్చినరుణంలో సింహభాగం తిరిగి చెల్లింపులకే పోతుంటే, ఈ పరిస్థితి అందరికీ ఆందోళన కలిగిస్తుంటే, రెండోపక్క ఇంకా అప్పులు ఎక్కడ తెద్దాం, ఎలా తెద్దాం అని ప్రభుత్వం ఆపసోపాలు పడుతోంది. ఒకపక్క కరువుతో జనం కటకటలాడిపోతుంటే, మరోపక్క కార్లరేసులు నడపటానికి ప్రభుత్వం ఉబలాటపడుతుంది. మన ఆర్థిక పరిస్థితిని మానేజ్ చేయటంలో ప్రభుత్వం ఘోరంగా విఫలమైందనడానికి ఇవి కొన్ని ఉదాహరణలు మాత్రమే. అయినా ఇదే గుడ్ గవర్నెన్స్ అంటున్నారు. ఈ బాపతు నాయకుల్ని కొంతకాలం ఎర్రగడ్డ ఆసుపత్రికి (పిచ్చాసుపత్రి) పంపిస్తే, అక్కడ వాళ్ళబుర్రలు రిపేరు చేస్తారు. మనం బతికిపోతాం.

* * * *

డాలరుతో పోలిస్తే రూపాయివిలువ ఇటీవలి వారాల్లో బాగా పెరుగుతోంది. ఇటీవలివరకూ సుమారు 50 రూపాయలిస్తేనే గాని ఒకడాలరు దొరకని పరిస్థితి వుండేది. కాని ఇపుడు రూ.45లకే ఒక డాలరు పలుకుతోంది. ఇది ఆర్థికపరిస్థితిబాగుపడుతుందనడానికి ఒకసూచనఅవుతుందో, కాదోకాని ఎగుమతి, దిగుమతి వ్యాపారానికి మాత్రం ఇదో ఇబ్బందికరమైన విషయమే. రూపాయివిలువ పైసలు పెరిగితే, ఎగుమతి చేసేవారికి ప్రతి పదిలక్షలకు ఒక లక్షరూపాయల నష్టం వస్తుంది. దిగుమతి చేసుకునేవారికి అంతేమొత్తం లాభం వస్తుంది. ఇంకా వివరంగా చెప్పాలంటే ఇదివరకు ఎగుమతిదారు ఎగుమతిచేసిన ఉత్పత్తి ఖరీదు ఒకడాలరు అనుకుంటే, అతనికి 50 రూపాయలు చేతికొచ్చేది; ఇపుడు 45 రూపాయలే వస్తుంది. అయిదు రూపాయలు నష్టం. అలాగే ఒక డాలరు విలువగల వస్తువు దిగుమతి చేసుకుంటే ఇదివరకు 50 రూపాయలు చెల్లిస్తూరాగా, ఇపుడు 45 రూపాయలు చెల్లిస్తాడు కాబట్టి అయిదు రూపాయలు లాభం. గత జనవరి నుంచి డాలరుతో పోలిస్తే మన రూపాయివిలువ 215 పైసలు పెరిగింది కాబట్టి, ఎగుమతిచేసే ప్రతీ 10 లక్షల డాలర్లకు రూ.21.5 లక్షలు నష్టం వస్తుంది. అయితే మనదేశం దిగుమతులు లాభపడుతాయి. అయితే ఏమిటిది? ఈ ప్రశ్నకు జవాబు చెప్పాలంటే ఆర్థిక సిద్ధాంతాలన్నీ మీకు చెప్పాల్సివస్తుంది. ఇప్పుడు కాదులెండి.

– విహారి

# ప్రభుత్వ సీసాలో కొత్త మద్యం-ఫార్ములా 1

— వి. కొమరయ్య

హైదరాబాద్ ఫార్ములా వన్ కార్లపందాల క్రీడకావాలా, అక్కర లేదా అని చాలా చర్చ జరుగుతుంది. అసలది ఏమిటో ఎవరు తెస్తున్నారో చూస్తే ఎవరికి ప్రయోజనం ఎవరికి నష్టమో కూలంకష మైన వివరణ ఏమీలేకుండా దానిగురించి రాష్ట్రప్రభుత్వం ప్రజలను భ్రమల్లో ముంచే ఆడంబర ప్రచారం సాగిస్తుంది. ఫార్ములా వన్ రేసులను హైదరాబాదుకు తీసుకురమ్మని అడగడానికి ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు స్వయంగా ఇటలీ వెళ్ళాడు. ఫార్ములా వన్ మేనేజ్‌మెంట్ సి.ఇ.ఓ. బెర్నీ ఎకిల్‌స్టోన్‌ను కలిసి హైదరాబాదుకు వచ్చి ప్రభుత్వం ఇవ్వదలచుకున్న 1300 ఎకరాల స్థలాన్ని ఇతర మౌళిక సదుపాయాలను చూడాలని ఆహ్వానించాడు. (ఆ స్థలం ఖచ్చితంగా ఎంతోకూడా ప్రభుత్వం సక్రమంగా ప్రకటించడంలేదు. 500 ఎకరాల నుంచి 1300 ఎకరాల వరకు ఈ స్థలం గురించి వేర్వేరు ఊహాగానాలున్నాయి. అదేసమయంలో కర్నాటక, మహారాష్ట్ర ప్రభుత్వాలు కూడా తమరాష్ట్రాల్లో ఫ్మార్ములా వన్ ఏర్పాటు చేయాలని విజ్ఞాపనలు పంపుతున్నాయి. ఢిల్లీ రాష్ట్ర ప్రభుత్వం ఫార్ములావన్ తమదగ్గర రాబోతున్నట్టు ప్రకటించింది. పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం కొన్ని సంవత్సరాల కింద ఫార్ములావన్‌ను ఆహ్వానించి అన్ని సౌకర్యాలు కల్పించి భంగపడింది.

ఈ పూర్వరంగంలో చంద్రబాబునాయుడు అభ్యర్థనను ఎకిల్‌స్టోన్ అంగీకరించాడా? ఆఫ్రో ఏషియన్ క్రీడల సందర్భంగా హైదరాబాద్ వచ్చి ప్రభుత్వం ఇవ్వజూపుతున్న భూమిని చూస్తానని ఫార్ములావన్ పడవపందాలు హుస్సేన్‌సాగర్‌లో జరపడం వీలవుతుందో చూస్తానని అన్నాడు.

ఫార్ములావన్ రాకవల్ల 25 వేల మందికి ఉద్యోగావకాశాలు వస్తాయని చంద్రబాబునాయుడు ప్రధాన ఆకర్షణగా ప్రకటిస్తున్నాడు. ఈ అంకెకూడా 75 వేల నుంచి లక్షవరకు లక్షన్నరవరకు బొంకదలచుకున్నాడు ఆకాశమే హద్దు అన్నట్లు అటూఇటూ మారి పోతుంది. చివరకి శాసనసభలో జరిగిన చర్చలో కూడా ఫార్ములావన్ గురించి వివరాలు చెప్పకుండా లాభనష్టాలు రెండూ బేరీజు వేయకుండా కేవలం ఈ ఉద్యోగావకాశాల ఇంద్రజాలం చూపి ప్రతిపక్షాల బలహీన ప్రశ్నలను కూడా చంద్రబాబునాయుడు అడ్డుకున్నాడు. ఫార్ములావన్‌ను ప్రశ్నించడమంటే రాష్ట్రానికి రాబోతున్న గొప్ప ఉద్యోగావకాశాన్ని అడ్డుకోవడమేనని బెదిరించాడు.

ఇంతకీ ఫార్ములావన్ ఏమిటి? ఫార్ములావన్ మేనేజ్‌మెంట్ అనేది ఒక బహుళజాతి సంస్థ. అది ఇప్పటికి 17 దేశాల్లో కార్ల పరుగుపందాలు నిర్వహిస్తుంది. మామూలు కార్లు గంటకు 100 కి.మీ. ప్రయాణిస్తే ఈ పరుగుపందాల కార్లు గంటకు 3, 4 వందల కిలోమీటర్ల వేగంతో పరిగెడుతాయి. ఇటలీలో చంద్రబాబు నాయుడుకు ఈ వేగపు 'మజా'రుచి చూపించడానికి 250 కిలోమీటర్ల వేగంతో వెళ్లే కార్లో కాసేపు ప్రయాణం చేయించాడు. ఈ పందాలు గుర్రపుపందాల లాగానే చూపరులలో జూదకాంక్షను, ఒక వికృత ఉద్వేగాన్ని సృష్టిస్తాయి. ఈ చూపరులను ఆకర్షించి వాళ్లకు టికెట్లమ్మి పందాలు నడిపి ఆ పందాలు జరిగినన్ని రోజులు చుట్టుపక్కల అన్నిరకాల విలాసాలు, విందులు ఏర్పాటుచేసి వీటిద్వారా లాభాలు చేసుకోవడం ఫార్ములావన్ మేనేజ్‌మెంట్ పని.

ఇంతకు ఈ క్రీడ జరిగేది ఏడాదికి పదిరోజులు. ఆ పదిరోజుల్లో ఊద్చేవాళ్లుగానో, పానీయాలు తినుబండారాలు అందిచ్చేవాళ్లుగానో, పందాలు చూడడానికి వచ్చిన దేశదేశాల సంపన్నులకు విలాసాలు సమకూర్చిపెట్టేవాళ్లుగానో ఎంతో కొంతమందికి ఉద్యోగ ఉపాధి అవకాశాలు రావచ్చు. కానీ అది 10 రోజులకొరకు మాత్రమే. మిగిలిన 350 రోజులు ఫార్ములావన్ రేస్‌కోర్స్ ఎందుకూ పనికిరాని అందమైన నునుపైన వెయ్యిఎకరాల సిమెంట్ చప్టాలాగా ఉంటుంది. అంతేకాదు ఆ సిమెంట్ చప్టా మళ్లీ ఏడాది తర్వాత కార్లపరుగుకు ఉపయోగపడాలి గనుక దాని రక్షణకు, నిర్వహణకు కోట్లాది రూపాయలు ఖర్చుపెట్టవలసివుంటుంది. కనుక ప్రభుత్వం చెబుతున్నట్లు ఇది భారీస్థాయిలో ఉద్యోగావకాశాల కల్పనకు దారితీయదు సరిగదా ప్రభుత్వమే ఎదురు ఖర్చుపెట్టవలసిన స్థితి కల్పిస్తుంది.

ఇందుకు ఉదాహరణ చూడాలంటే జాతీయ క్రీడలకోసం ఆర్భాటంగా నిర్మించిన గచ్చిబౌలి స్టేడియం క్రీడలు అయిపోయిన తర్వాత నిర్వహించడానికి నెలనెల 15-20 లక్షల రూపాయల వ్యయంతో తెల్లఏనుగైపోయి ఆ నిర్వహణ పనిచూసే పోషకులు ఎవరైనా దొరుకుతారో అని ప్రభుత్వం పారిశ్రామిక సంస్థల చూట్టూ తిరుగుతుంది.

ఇందులో ఇంకొక వ్యవహారం కూడా ఉంది. ప్రతి సంవత్సరం ఈ పందాలు నిర్వహించినందుకు గాను ఫార్ములావన్ మేనేజ్ మెంటుకు రాయల్టీగా 50 కోట్ల రూపాయలు చెల్లించవలసి వుంటుంది. క్రీడారంగ నిపుణులే వేస్తున్న అంచనా ప్రకారం ప్రేక్షకుల నుంచి టిక్కెట్ల రూపంలో వసూలయ్యే డబ్బు ఎక్కువలో ఎక్కువ 15 కోట్లకు మించదు. వేరేదేశాల్లో అయితే ఈ టికెట్టు 100 డాలర్ల నుంచి 250 డాలర్లు ఉంటుంది. అంటే 5 వేల రూపాయల నుంచి 12500 వరకు ఇక్కడ అంత ఖరీదు పెట్టలేమని వెయ్యి రూపాయల టికెట్టు పెట్టవచ్చునని అయినా ఒక సంవత్సరం క్రీడలను లక్షాయాభైవేలమంది చూసినా 15 కోట్లకు మించిరాదని క్రీడారంగ నిపుణులు చెబుతున్నారు. అంటే ఒకవేళ నిజంగా ఈ రేసుకోర్సును ఏర్పాటుచేసినా ప్రభుత్వం ప్రజాధనం నుంచి బహుళ జాతి సంస్థలకు అప్పనంగా కోట్లాది రూపాయలను కట్టబెట్టవలసిందే తప్ప రాష్ట్రానికి, రాష్ట్ర ప్రజలకు గాని ఒరిగేదేమీ లేదు.

రేసుకోర్సు రావడం వల్ల వచ్చినవాళ్ళు ఉండడానికి హోటళ్ళు అవసరమైతాయని, ప్రయాణ సౌకర్యాలు అవసరమైతాయని, వినోదాలు అవసరమైతాయని మొత్తంగా టూరిజం పరిశ్రమ అభివృద్ధి చెందుతుందని ప్రభుత్వం చెబుతోంది. ఇందులో రెండు అంశాలున్నాయి. మొదటిది ఈ టూరిజం పరిశ్రమ అభివృద్ధి జరుగుతుందని అనుకున్నప్పటికీ అది కేవలం ఆయారంగాల పెట్టుబడిదారులకు ప్రయోజనకరమైనదే తప్ప సాధారణ ప్రజలకు పనికొచ్చేదేమీకాదు. రెండు ప్రపంచవ్యాప్తంగానే టూరిజం పరిశ్రమ అభివృద్ధి అంటే అర్థం వ్యభిచార పరిశ్రమ అభివృద్ధిగా మారిపోయింది. గనుక అందులోనూ కార్లపందాల థ్రిల్‌తో మైమరచిన కామందులకు ఆ అవసరాలు కూడా తీరాలిగనుక హైదరాబాద్ మద్యవ్యాపారానికి మానవమాంస వ్యాపారానికి కేంద్రం అయిపోతుంది.

ఇక్కడ గుర్తించవలసింది మరొకటి కూడా ఉంది. ఈ 500 ఎకరాల 1000 ఎకరాల స్థలంలో రేస్‌కోర్స్ ఏర్పాటుచేయడానికి 600 కోట్ల రూపాయల నుంచి వెయ్యికోట్ల రూపాయల వరకు అవసరం అవుతాయని ఒక అంచనా. ఈ నిర్మాణపు పని ఫార్ములా వన్‌ది కాదు. అందుకోసం మరో బహుళజాతి సంస్థను పట్టుకోవాలి. లేదా అంతర్జాతీయ విమానాశ్రయ నిర్మాణంలో ప్రభుత్వమే 350 కోట్లు వడ్డీలేని రుణం పెట్టుబడిదారుల దోసిలిలో పోసినట్లు ఈ వెయ్యికోట్లు కూడా ప్రజాధనం పోయాలి. వెయ్యికోట్ల రూపాయలవమీద సాలీనా వడ్డీకే 100 కోట్లు అవసరమవుతాయి గనుక అంతో అంతకన్నా ఎక్కువో ప్రతిఫలం లేకుండా ఏ సంస్థ ఈ నిర్మాణం చేపట్టడానికి ముందుకు రాదు. అంటే ఈ నిర్మాణబాధ్యత కూడా రాష్ట్రప్రజల సంపదమీదనే పడుతుంది. మొత్తంవమీద రాష్ట్ర ప్రజానీకం తమకెందుకూ ఉపయోగపడని ఒక తెల్లఏనుగు కోసం వేలాదికోట్ల రూపాయల తమ నెత్తురు చెమట వెచ్చించవలసివస్తుంది. ఈ వేలాదికోట్ల రూపాయలలో బహుళజాతి సంస్థలు మిగుల్చుకునేది రాష్ట్ర రాజకీయ నాయకత్వం అధికార యంత్రాంగం ముడుపుగా గ్రహించేది ఎన్నివందల కోట్లో ఎవరైనా ఊహించవలసిందే.

అంతమాత్రమే కాదు. ఈ కార్ల రేసింగ్‌కు ఒక సాంస్కృతిక కోణం కూడా ఉంది. ప్రాణాలు కూడా బలిపెట్టి కార్లను వేగంగా పరిగెత్తించి ఆ క్రమంలో ప్రమాదాలకు గురై ఆ కార్ల డ్రైవర్లు సాధించేదేమిటి? వాళ్ళు పొందే హింస వాళ్ళ దుర్మరణాలను వాళ్ళు గాయపడటాన్ని చూస్తూ సంతోషిస్తూ ఈలలు చప్పట్లు చరిచే ప్రేక్షకుల సంస్కారం ఎంత నీచమైనది. ప్రజలు తమ నిత్య జీవితసమస్యలు పట్టించుకోకూడదని వాటికి పరిష్కారాలు వెతకకూడదని నిత్యం మత్తులో తేలియాడుతూ మైమరచిపోవాలని లోకాన్ని మరచిపోవాలని పెట్టుబడిదారీ విధానం సృష్టించిన అనేక క్షుద్ర సరుకులలో ఈ పరుగుపందాల థ్రిల్ ఒకటి. ఈ థ్రిల్ పెట్టుబడిదారీ దేశాలనుంచి తెచ్చి ఇక్కడ అంటకట్టాలని రాష్ట్ర పాలకులు ప్రయత్నిస్తున్నారు. ఇప్పటికే హైదరాబాదులోనూ, ఇతర నగరాల్లోనూ ఆలోచించగల యువతరాన్ని జోకొట్టి నిద్రపుచ్చి మైమరపింపజేయడానికి అనేక ఆకర్షణలు, భ్రమలు, మాదకద్రవ్యాల సంస్కృతిని విస్తరింపచేస్తున్న తెలుగుదేశం ప్రభుత్వం కొత్త ఎత్తు ఈ ఫార్ములావన్ రేస్. ప్రతిపక్షాలు విమర్శిస్తున్నట్లు ఆహారమా ఫార్ములానా అనే ప్రాధాన్యత క్రమాన్ని ప్రభుత్వం మరిచిపోయినందువల్ల మాత్రమే ఇది రావడంలేదు. ఇది కేవలం ప్రాధాన్యతల సమస్యకాదు. ఇది రాజకీయ ఆర్థిక సాంస్కృతిక ప్రయోజనాల సమస్య. ప్రభుత్వపు రాజకీయ ఆర్థిక సాంస్కృతిక ప్రయోజనాలు ఫార్ములావన్‌లో ఉన్నాయి. మద్యనిషేధాన్ని రద్దుచేసిన ప్రభుత్వం ప్రవేశపెడుతున్న కొత్త మద్యం ఫార్ములా వన్ రేస్. ○

# అయోధ్య తవ్వకాలు - పూర్వాపరాలు

— వకుళాభరణం రామకృష్ణ

**అయోధ్యలో** బాబ్రీమసీదును హిందుత్వ విధ్వంసక శక్తులు కూలదోసి ఒక దశాబ్దం గడిచింది. కోర్టుల్లో కేసులు ఇంకా నడుస్తూనే ఉన్నాయి. ఒకవైపు అక్కడి స్థలంపై దాన, విక్రయాది సొంతహక్కులు ఎవరికున్నాయన్న మౌలిక వివాదానికి ఇంకా న్యాయస్థానాల నుండి తీర్పురావాల్సివుంది. ఆ తీర్పుకు అందరూ కట్టుబడివుండాలి. సుప్రీం కోర్టునుండి కిందదాకా, రాజకీయపక్షాలతో సహా అందరూ అంగీకరించగా, విశ్వహిందూపరిషత్, భజరంగ్‌దళ్ లాంటి సంఘపరివార్ శక్తులు మాత్రం రామాలయ సమస్యను హిందువుల విశ్వాసానికి సంబంధించినదిగా వర్ణిస్తూ, కోర్టుతీర్పు శిరోధార్యం కాదని చెబుతున్నారు. రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్, భారతీయ జనతాపార్టీ యీ విశ్వాసం అనే అంశాన్నే పదేపదే చెబుతూ, ప్రధానమంత్రినుండి కింది కేడర్ దాకా, హిందువుల (ఏ హిందువులు? దేశంలో హిందూ సమాజంలో వుండే అందరూనా?) మనోభీష్టమైన ఆలయ నిర్మాణానికి ముస్లింలు అంగీకరించాలని సన్నాయినొక్కులు నొక్కుతున్నారు. మరోవైపు ముస్లిములు యీ దేశంలో హిందువులతో కలిసి సహజీవనం సాగించాలంటే, యిలాంటి వెసులుబాటుధోరణి చూపించి తీరాలని పరోక్షంగా బెదిరింపులు చేస్తున్నారు. భారతీయ జనతాపార్టీ కూడా బహిరంగంగా ఆలయనిర్మాణమే తమ అభిమతం అని చెపుతూ, ప్రస్తుతమున్న ఎన్.డి.ఎ. కూటమి, అనేక పార్టీలతో కలిసివున్నందున అది సాధ్యంకాదని, మెజారిటీ వచ్చినరోజు పక్కకు పెట్టిన తన అసలు అజెండాను అమలువరుస్తుందని బహిరంగంగానే చెపుతూవస్తోంది. తన మతవిశ్వాసాల కంటే, రాజకీయ అధికారమే ప్రస్తుతానికి ముఖ్యమని దీని సారాంశం. పైగా రాజకీయ ఎత్తుగడల్లో యిదొక భాగం కూడా. సంకీర్ణ ప్రభుత్వంలో అగ్రగామిగా పెత్తనం చలాయించడం ద్వారా, కొన్నాళ్ళకు క్రమేపీ, యితర పార్టీలను నామమాత్రం చేసి, అంతిమంగా అధికారంలోకి రావడమే వారి లక్ష్యం. సరిగ్గా ఇదేరీతిలో జర్మనీలో నాజీశక్తులు అధికారంలోకి వచ్చాయన్న విషయం మనకు చరిత్ర నేర్పిన గుణపాఠం. జాతీయ ప్రజాస్వామిక కూటమిలో భాగస్వాములుగా వున్న అనేకానేక పార్టీలు గానీ, వెలుపలుండి వత్తాసు పలుకుతున్న పార్టీలుగానీ యీ విషయాన్ని గమనించకపోవడం దీర్ఘకాలికంగా ఆత్మహత్యాసదృశ్యమే అవుతుంది.

పది సంవత్సరాలుగా అయోధ్యకు న్యాయస్థానాల్లో పరిష్కారం దొరక్కపోవడం, మసీదు విధ్వంసంలో ప్రత్యక్షంగా పాల్గొన్నవారిని శిక్షింపకపోవడం అటుంచి, అలహాబాద్‌హైకోర్టు తాజాగా (ఏడెనిమిది నెలలకుముందు) మసీదునుకూలగొట్టినచోట, దానికింద దేవాలయం ఒకటి వుండేదా లేదా అన్నది నిగ్గుతేల్చమని పురావస్తుశాఖను ఆదేశించింది. ఈ నిర్ణయాన్ని అప్పుడే అనేకమంది విజ్ఞులు విమర్శించారు. ఇది సరైన పద్ధతి కాదనీ, యిందులో నిజానిజాలు తేల్చడం కష్టతరమనీ, అసలు సమస్య అక్కడ ఆలయ అవశేషాలకు సంబంధించి కాదన్నారు. ఆస్తులపై దాన, విక్రయాది హక్కు భుక్తులు ఎవరికున్నాయన్న చట్టపరమైన సమస్య మౌలికమైందని చెప్పారు. చట్టరీత్యా అది అందరిపై ఖచ్చితంగా అమలుపర్చగలిగిన శక్తిగా వుంటుందనీ, దాన్ని అందరూ శిరసావహించి తీరాలన్నారు. ఒకవేళ దేవాలయం అన్నదే లేదని తేల్చినా, హిందుత్వశక్తులు దాన్ని అంగీకరించవు. విశ్వాసమే తమ డిమాండ్‌కు మూలమని చెప్పారు. అలాగే, ముస్లింలు కూడా ఒకవేళ ఆలయంవుందని నిరూపించగలిగినా, ఆస్తి వివాదంగా అది న్యాయస్థానాల్లో నలుగుతూ వున్నందున, పురావస్తు శాఖ త్రవ్వకాల అంశాలను అంగీకరిస్తారన్న నమ్మకమూలేదు.

అయినా కోర్టువారి ఆదేశాల ప్రకారం త్రవ్వకాలు ఆరంభమై, ఆగస్టు 22వ తేదీకి పూర్తిచేయడమే కాకుండా, ఆరోజుకు అలహాబాద్ హైకోర్టు లక్నో బెంచీకి 574 పుటల దీర్ఘ నివేదికను సమర్పించడం జరిగింది. నివేదికను ఇరుపక్షాలవారికి అందజేశారు. దాన్ని అధ్యయనంచేసి తమతమ వాదనలను వివరించడానికి వారికి వ్యవధి ఇచ్చారుకూడా. ఈలోగా, పత్రికల్లో, నివేదిక సారాంశంగా చెప్పబడుతున్న, అక్కడ లభించిన అవశేషాల ఆధారంగా, మసీదుకు ముందు 10-12 శతాబ్దాల మధ్య ఉత్తర భారతదేశంలో నెలకొన్న దేవాలయ సంప్రదాయానికి సంబంధించిన ఒకకట్టడం ఉండొచ్చునన్నవార్తాంశం వెలుగులోకి వచ్చింది. ఇక పరివారశక్తులు, విశ్వాసబృందాన్ని పక్కకు నెట్టకుండా (ఎందుకంటే వారివాదనలకు, కార్యాచరణకు అదేమూలం కాబట్టి) ఇప్పుడు చారిత్రక ఆధారాలు కూడా తమను బలపరుస్తున్నాయన్న వాదనతో, ఆలయ నిర్మాణాన్ని ముగ్గులోకితెచ్చారు. ఏమైనా ఆలయనిర్మాణం అతిత్వరలో చేపట్టాలని చెపుతున్నారు. అక్టోబర్ నెలలో, అయోధ్యలో 5 లక్షల మందితో గొప్ప ప్రదర్శన, సభలు జరపాలని విశ్వహిందూపరిషత్ నిశ్చయించి ఆ దిశలో ఏర్పాట్లు చేస్తోంది. మరోవైపు కొన్నికోట్ల రూపాయల ఖర్చుతో రాజస్థాన్‌లో రెండు మూడు కేంద్రాలలో, 20 వేలమంది పనివాండ్రతో శిల్పులతో ఆలయ నిర్మాణానికి కావలసిన స్తంభాలు వగైరా సామగ్రిని తయారు చేయడంలో నిమగ్నమైవుంది. ఇదేసందర్భంలో, భారతీయజనతాపార్టీ

ఆలయనిర్మాణానికి చిత్తశుద్ధితో కృషిచేయలేదనీ, తాము ఆ పార్టీని వచ్చే అయిదు రాష్ట్రాల ఎన్నికల్లో బలపరచబోమనీ, తీవ్రంగా విమర్శలను భారతీయ జనతాపార్టీ అగ్రనాయకులపై విశ్వహిందూపరిషత్ గుప్పిస్తోంది. ఇది భారతీయ జనతాపార్టీపై పరోక్షంగా వత్తిడి తీసుకురావడమే అవుతుంది. ఇందులో రాజకీయ చాణక్యం లేకపోలేదని అభిజ్ఞులు భావిస్తున్నారు. ఎన్నికల్లో హిందుత్వ శక్తులు భారతీయ జనతాపార్టీని మినహాయించి ఎవరిని సమర్థిస్తారు? కాంగ్రెస్‌నా? కొత్తగా ఉత్తరప్రదేశ్‌లో ఏర్పడిన 'మౌల్వీ' ములాయం సింగ్ ప్రభుత్వాన్నా? ఇప్పటికే ములాయం సింగ్ లోపాయికారిగా భారతీయ జనతాపార్టీతో ఒక అంగీకారానికి వచ్చాడని రాజకీయ పరిశీలకులు చెప్పడంలో ఆంతర్యం ఏమిటి? ములాయం సింగ్ ప్రమాణ స్వీకారానికి ఎన్.డి.ఏ. కన్వీనర్ జార్జి ఫెర్నాండెజ్ రావడం వెనుక కారణాలు ఏమిటి? భారతీయ జనతాపార్టీ నుండి అనేకమంది ఎం.ఎల్.ఏ.లు పార్టీ నుండి బయటకొచ్చి సమాజ్‌వాదీపార్టీని బలపర్చడానికి సిద్ధపడ్డా, ములాయం సింగ్ భారతీయజనతాపార్టీని చీల్చకుండా వుండడాన్ని స్పీకర్‌ని మార్చకుండా వెనక్కుతగ్గడానికి కారణాలేమిటి అన్నది కూడా ఆలోచించాల్సిన అంశంగా ఉంది. ఈ రాజకీయపరిణామాలకు నేరుగాకాకున్నా, మరోవిధంగా నేపథ్యంగా వున్న అయోధ్య తవ్వకాల నివేదికలోని ముఖ్యాంశాలను పరిశీలిద్దాం.

5 నెలల వ్యవధిలో 90 కందకాలను తవ్వి, పరిశోధనలు జరిపి, ఆ తర్వాత అతికొద్ది రోజుల్లో ఒక బృహత్ నివేదికను సమర్పించడం, దాదాపు నూటయాభై సంవత్సరాల పురావస్తుశాఖ చరిత్రలో అపూర్వంగా అందరూ విస్తుపోతున్నారు! అదలా వుంచుదాం. ఇప్పటి తవ్వకాల్లో బాబ్రీమసీదుకు ముందే ఆలయం వుందని చెప్పడాన్ని ముఖ్యాధారంగా స్తంభాల పునాదులని నివేదిక వక్కాణిస్తుంది. అయితే, యిది యివ్వాళ చెపుతున్న కొత్త విషయమేమీ కాదు. 1970లో జరిగిన తవ్వకాల్లో కన్పించాయని, 1990లో పురావస్తుశాఖ డైరెక్టర్ జనరల్ బి.బి.లాల్, సంఘ్‌పరివార్ పత్రిక 'మంథన్'లో రాశాడు. దీనిపై వివాదం చెలరేగింది. ఏ ఆధారాలపై అలా రాశారో చెప్పాలని, దానికి సంబంధించిన సైట్ రిపోర్టుని వెల్లడించి అందరికీ అందచేయాలని ఎందరో చరిత్రకారులు పట్టుపట్టారు. కానీ ఇంతవరకూ దాన్ని వెలువరించనే లేదు. ఇప్పటి నివేదికలోనూ అదే అంశం ఉండడం ఆయాచితం కాకపోవచ్చు. కుప్పలుగా పోసివున్న రాళ్ళగుట్టలు, స్తంభాలు కావనీ, రెండో అంతస్తు నిర్మిస్తున్నపుడు, నేలలో అంతకుముందున్న పెద్ద కంతలను పూడ్చడానికి వాడిన రాతిసామగ్రిగా వీటిని ప్రముఖ పురావస్తు పరిశోధకుడు సరజ్‌భాన్ (కురుక్షేత్ర విశ్వవిద్యాలయం), మరో ప్రముఖ చరిత్రకారుడు ఇర్ఫానుద్దీన్ పేర్కొన్నారు. ఎక్కడా ఒక స్తంభం జాడకూడా తవ్వకాలు చూపలేకపోయాయని వీరు నిర్ద్వందంగా ప్రకటించారు. 1992లో ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం మసీదు చుట్టుపక్కల ఉన్నస్థలాన్ని పర్యాటకశాఖకు అప్పగించింది. అప్పుడు జరిపిన తవ్వకాల్లో దొరికిన పూర్తి కీలక అవశేషాలను నిర్లక్ష్యంగా గాలికి వదిలేసి నందున, నిజనిర్ధారణకు తీవ్ర అంతరాయం కలిగిందని వీరు చెప్తున్నారు. 'కరసేవక్' పురావస్తుశాస్త్ర పరిశోధకుడుగా పేరుగాంచిన బి.బి.లాల్ కొన్ని సంవత్సరాల నుండి (ఈ నివేదిక వెలువడకముందు) మసీదుకు ముందే అక్కడ ఆలయముందని చెప్తూ వచ్చాడు.కోర్టుకు సమర్పించిన నివేదిక ఏ విధంగానూ శాస్త్రీయం కాదని ఎందరో చరిత్రకారులు నొక్కిచెప్పారు. వారు చెప్తున్నఅంశాల్లో మరోటి, త్రవ్వకాల్లో బయల్పడిన కుండపెంకులు (యివి అప్పటికాలాన్ని తెలియచేయడమే కీలక ఆధారాలు) వగైరాలను సక్రమంగా పరీక్షించడానికి ఉపయోగించే 'థెర్మోల్యూమినిసెన్స్' పద్ధతిని పాటించక పోవడం. రెండోది, అక్కడ లభించిన జంతువుల అస్థికల్ని కార్బన్ డేటింగ్ పద్ధతి ద్వారా పరిశీలించకపోవడం. వీటిని పాటించివుంటే, వాస్తవాలు తెలిసి,అవి ఎప్పటికాలంనాటివో నిర్ధారితమయ్యేదని గట్టిగా వీరు అభిప్రాయపడుతున్నారు.

నివేదిక తయారుచేయడంలో పాటించిన పద్ధతిని కూడా వీరు తప్పు పడుతుండడం గమనించాలి. నివేదికలో ఆఖరి అధ్యాయం 'ఫలితాల సారాంశం' ఈ సారాంశం సర్వసాధారణంగా వాచకంలో ముందే చెప్పిన విషయాల ఆధారంగా వుండాలి. వుంటుంది కూడా. కానీ, ఇక్కడ అలా లేదు. ఉదాహరణకు 'సారాంశం' అనే భాగంలో 'జంతువుల అస్తికలు' భూమిలోని ఏఏ పొరల్లో దొరికాయో వివరించారు. కాగా, ప్రధాన నివేదిక మొత్తంలో విషయ వివరణ సందర్భంగా ఎక్కడా వీటి ప్రస్తావనే లేకపోవడం గమనార్హం! అదే క్రమంలో, తవ్వకాల్లో వెలువడ్డ అంతస్తులను సంఖ్యలవారీగా రేఖాచిత్రాల్లో ఉటంకించినా వాటినిగూర్చి విశ్లేషించినచోట (నివేదికలో) ఇవ్వలేదు. ఇది సాదా, సీదా, అమాయకంగా దొర్లినతప్పులుగా భావించాలా? కాదనే విజ్ఞులు వక్కాణిస్తున్నారు. నివేదికలో పురావస్తుశాఖ చేసిన మరో ముఖ్య తప్పిదం, జంతువుల అస్తికల్ని, గాజు-పింగాణి సామగ్రిని నిర్లక్ష్యంగా పారవేయడం గురించి. అవి చాలా ముఖ్యమైన ఆధారాలు. అయినప్పుడు వాటిని ఎందుకు పదిలపరచలేదు? ముఖ్యంగా మాంసాహారం తినిపారేసిన బొమికలను పరీక్షిస్తే, అక్కడ ఆలయం ఉండేదన్న వాదనకు ఆస్కారమే వుండదు. గాజు-పింగాణి సామగ్రి దొరకడంతో, ఇది ముందుకాలంలో ముస్లిముల జనావాసంగా పేర్కొనడానికి అవకాశాలు మెండుగా వున్నాయని చరిత్రకారులు అభిప్రాయపడుతున్నారు. తవ్వకాల్లో ఇతరత్రా అవశేషాలను పరిశీలించిన విద్వాంసులు, అందులోని అనేక వస్తువులు జైన, బౌద్ధ, శైవమత శాఖలకు చెందివుండాలని చెప్తున్నారు. బౌద్ధసంబంధమైన అవశేషా లుండడంతో, విశ్వబౌద్ధ సంఘం, తమ కార్యకర్తల్ని కూడా తవ్వకాల ప్రక్రియలో భాగస్వాముల్ని చేయమని కోరింది కూడా. ఇంతకీ అందులో నిగ్గుతేలినవి రెండే అంశాలు. తవ్వకాల్లో పశ్చిమంవైపు ఒక పెద్ద పొడుగాటి గోడ, నేలపై ఒక ఎత్తైన ప్లాట్‌ఫారం (వేదిక లేక అరుగు) వుందని మాత్రమే. ఆలయం ఉండేదని కూడా నిర్ధారణ చేయలేదు. ఆలయం ఉండడానికి అవకాశం వుందని మాత్రమే నివేదిక చెప్పింది. దీన్ని ఆమోదించడంలేదని ముస్లిం పర్సనల్ బోర్డు ప్రకటించింది. పరివారశక్తులు మాత్రం తమకు అనుకూలంగా నివేదిక వుందని ప్రకటించి, ఆలయ నిర్మాణానికి ముస్లిములు అడ్డుతగలరాదని చెప్తున్నాయి. కోర్టులో వాద, ప్రతివాదనలు ఇంకా పూర్తి కాలేదు. ఏమైనా రాజకీయ వైఫల్యాలకు, లోపభూయిష్ట పరిపాలనకు మతం అనే ముసుగును భారతీయ జనతాపార్టీ తదితర పరివారశక్తులు వాడుకోవడం ప్రజలు గమనించకుండా వుండరు. ○

# పతనమవుతున్న పార్లమెంటు ప్రజాస్వామ్యం

— వి. హనుమంతరావు

రాష్ట్ర శాసనసభ చరిత్రలో మొన్నమొన్నజరిగిన వారందినాల వర్షాకాల శాసనాసభా సమావేశం ఒక మాయనిమచ్చగా మిగిలి పోతుందని అంటే అది చాలాచాలా తక్కువగానే చెప్పినట్లవుతుంది. చర్చలు ఇంత పతనావస్థలో, ఇంత దిగజారిన విలువలతో జరగటం నా 50 సంవత్సరాల పార్లమెంటు, శాసనసభ కవరేజ్ అనుభవంలో ఎప్పుడూ చూడలేదు. ఇతర రాష్ట్రాల్లో శాసనసభా సమావేశాల్లో చేతులు కలపటం, ముష్టియుద్ధాలు, కుర్చీలు విసురుకోవడం లాంటి హింసాత్మక సంఘటనల గురించిన వార్తలు పత్రికల్లో చదివినపుడల్లా మన రాష్ట్ర శాసనసభలో సభ్యులు అంత దిగజారుడుతనాన్ని ప్రదర్శించలేదని సంతృప్తిచెందేవాణ్ణి. కాని ఈసారి సమావేశంలో అటువంటి ఘటనలు చోటుచేసుకోకపోయినా, చర్చ ఎంత పతనావస్థకు చేరుకోగలదో, పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని ఎన్ని నిలువుల లోతున పాతిపెట్టవచ్చునో కళ్ళారా చూడడం జరిగింది. మాకు పార్లమెంటరీప్రజాస్వామ్యంలో విశ్వాసముంది, నమ్మకముంది అని ఒకపక్క ఒట్టువేసి చెబుతూనే, ఆచరణలో ఒట్టుతీసి గట్టునపెట్టిన వైనం చూస్తే, మాకు పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో విశ్వాసంలేదు, మేము తుపాకీనేనమ్ముతాం అనిఅనే నక్సలైట్లే మెరుగేమోననిపిస్తుంది.

ప్రతి సమావేశం ముందుగా పత్రికల్లో జరగనున్న సమావేశం ఎంత గరంగరంగా వుండబోతుందో, ఏయే విషయాలు చర్చకు వస్తాయో, అధికారపక్షం, ప్రతిపక్షం వాగ్యుద్ధాలకు ఎలా తయారవు తున్నారో పాఠకులకు తెలియచేసే వార్తావ్యాఖ్యలు ప్రచురితమవు తుంటాయి. ఈసారి కూడా అలాంటి వ్యాఖ్యావార్తలు వెలువడడమే కాకుండా పాలకపార్టీ ప్రతిపక్షాలనెదుర్కోవడానికి ఓ ఇరవైమంది సభ్యులకు శిక్షణఇస్తున్న విషయం అన్ని పత్రికల్లో వచ్చింది. అలా శిక్షణపొందిన సభ్యులందరూ వారంరోజులూ షౌటింగ్ బ్రిగేడ్ పాత్రను అఖండం గానే పోషించారు. వారి కేకలు, అరుపులు టి.వి.ల్లో బ్లాక్అవుట్ చేసారేమో తెలియదుకాని, సభలోకూర్చొని విన్నవారికి, చూచినవారికి అత్యంత జుగుప్సాకరంగా అనిపించింది. శాసనసభలో గలభా సృష్టించడానికి శిక్షణ ఇవ్వడమనేది ఈ 50 సంవత్సరాల్లో మొదటిసారిగా వింటున్నా. మొదటి పార్లమెంటు సమావేశంలో విశాలాంధ్ర విలేఖరిగా పార్లమెంటు చర్చలను రిపోర్టు చేయడానికి వెళ్ళినప్పుడు అప్పటికి ప్రధాన ప్రతిపక్షంలో వున్న కమ్యూనిస్టుపార్టీ పనివిధానాన్ని గమనించే అవకాశం ఏర్పడింది. సమావేశం ప్రారంభం కాకముందు, ఆ తర్వాత ఆదివారం పార్టీ సభ్యులందరి సమావేశం జరిగేది. జరిగిపోయిన వారంలో చర్చల సరళిని, పార్టీ సభ్యుల పాత్రను చర్చించడం, రాబోయేవారంలో ఏయే బిల్లులు, విషయాలు చర్చకు వస్తాయి, ఎవరు మాట్లాడాలి, ఏం మాట్లాడాలి అన్నీ చర్చకు వస్తుండేవి. ఏ విషయం గురించిన బిల్లు చర్చకు వస్తుందో, ఆ విషయం మీద వివిధ రాష్ట్రాలనుంచి ఎన్నికై వచ్చిన సభ్యులు, తమ రాష్ట్రాల అనుభవాలను చెప్పటం, ఎవరైతే ఆ బిల్లుమీద మాట్లాడుతారో వారు ఆ విషయాలన్ని నోట్ చేసుకొని, సభలో ప్రస్తావించటం జరిగేది. అంతేగాని, ఎలాగోలా చేయాలి, అరవాలి అనే కవాతులకు శిక్షణ ఇవ్వటం నేను చూడలేదు. ముఖ్యమంత్రి మాట్లాడినంతసేపూ గప్‌చుప్‌గా కూర్చునే పాలకపార్టీ సభ్యులంతా ప్రతిపక్ష సభ్యులు ప్రశ్న వేయడానికో, వివరించడానికో లేవటం తడవుగా పెద్దఎత్తున కేకలు, అరుపులు చేస్తున్నారని ఇట్టే తెలిసిపోతుంది. ఇలాంటి నూతన సాంప్రదాయాన్ని సృష్టించిన ఆ పార్టీ నాయకుడు ఫస్ట్ మార్కుకు అర్హుడే. ప్రతిపక్షాలు మాట్లాడినపుడు ఇలా నోరు పారేసుకునే సభ్యులు వారి నాయకుడు జోక్యం కలుగజేసుకోవడానికి లేచినపుడు, ఆయన సిగ్నల్ ఇచ్చి వారిని సైలెన్సు చేసేవరకూ అరుస్తూనే వుండటం చూస్తే పార్లమెంటరీ సాంప్రదాయాన్ని భ్రష్టుపట్టించడం ఓ పథకం ప్రకారమే జరిగిందని అనిపిస్తుంది.

1953లో ఆంధ్రరాష్ట్రం ఏర్పడినపుడు కర్నూలు శాసనసభలో ఒక పొడవాటిటేబుల్‌కు ఇరుపక్కన ప్రభుత్వ ప్రతిపక్షసభ్యులు కూర్చునే వారు. ఆ టేబుల్ ఎంత తక్కువ వెడల్పు వుండేదంటే, చెయ్యిచెయ్యి కలుపుకోవడానికి వీలైనంత తక్కువగా వుండేది. చర్చలు రాజకీయ స్థాయిలో ఎంత వేడివేడిగా జరిగాయంటే, ఒకరినొకరు నమిలి మింగేసేటంతగా వుండేవి. కాని ఎప్పుడూ సభామర్యాద పాటించ లేదనే విమర్శ వినరాలేదు. అపుడపుడే తెలంగాణాలో సాయుధ పోరాటాన్ని విరమించి శాసనసభకు వచ్చారేమో, కమ్యూనిస్టులు ఎప్పుడు ఏం చేస్తారో అని అనుకునేవారికి ఆశ్చర్యం కలిగించేరీతిలో వారు విమర్శకు ఏమాత్రం పదును తగ్గించకుండా, అదేసమయంలో పార్లమెంటరీ గేమ్ రూల్స్‌ను పాటించారు. అప్పుడూ, ఆ తర్వాత ఆంధ్రప్రదేశ్ శాసనసభలో కాంగ్రెసే కమ్యూనిస్టుల ప్రధాన లక్ష్యం. 1956 నుంచి ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు పుచ్చలపల్లి సుందరయ్య ప్రతిపక్ష నాయకునిగా వుండేవారు. అప్పటినుంచి ఈ దినం వరకూ ఆ పార్టీకి సభామర్యాదలను (నిరసనలు మినహా) అతిక్రమించిన సందర్భాలు లేవు. అదేసమయంలో ప్రభుత్వ విధానాలను చీల్చి చెండాడడంలో పదును తగ్గించిన దాఖలాలు లేవు. వ్యక్తిగతంగా విమర్శలు మొదలే లేవు. ఆ తర్వాత సర్దార్ గౌతు లచ్చన్న ప్రతిపక్ష నాయకునిగా వున్నపుడు కూడా చర్చల్లో

హుందాతనం లోపించిన సందర్భాలు లేవు. మహా అయితే గొంతుల్లో కాఠిన్యాన్ని, మొఖంలో ఆగ్రహాన్ని ప్రదర్శించి వుండవచ్చు తప్ప గీత దాటలేదు. ఆ సత్సాంప్రదాయం తరువాత భూస్థాపితం అయ్యింది. ఆ తర్వాత ప్రతిపక్షంలో కుర్చున్న కాంగ్రెస్ గాని, ఆ తర్వాత దేశం గాని ఏమంత ఆదర్శవంతంగా ప్రవర్తించిందని చెప్పలేను కాని ఇంత అడ్డగోలుగా ప్రవర్తించలేదు. ప్రతిపక్షం నిర్మాణాత్మక పాత్ర వహించాలి, సద్విమర్శలు చేయాలి అని అధికారంలో వున్నపుడు సుద్దులు చెప్పిన పార్టీలు ఆ నిర్మాణాత్మక పాత్ర అంటే ఎలా వుండాలో ఆచరణలో చూపించలేకపోయారు. ప్రస్తుత ముఖ్యమంత్రి అధికారంలోకి వచ్చినప్పటినుంచి శాసనసభ రూపేమారి, తొండముదిరి ఊసరవిల్లి అయినట్లు నేటి శిక్షణారహిత, బాధ్యతారహిత ప్రవర్తన చోటుచేసుకొంది. మేస్ పార్లమెంటరీ ప్రాక్టీస్ అని బ్రిటిష్ పార్లమెంటరీపద్ధతులు, సాంప్రదాయాలు శిరోధార్యమని అధికారపార్టీలు చెబుతుంటాయి. ఆ ప్రాక్టీస్ మాట అటుంచి కనీసం రాష్ట్ర శాసనసభ నియమ నిబంధనలకే నీళ్ళొదలటం, బిజినెస్ అడ్వైజరీ కమిటీలో అంగీకరించి, సభలోకి వచ్చి తద్విరుద్ధంగా ప్రవర్తించటం స్పీకర్ ఎవరినీ సముదాయించలేక తలపట్టుకొని కూర్చోవడమో లేక పరిష్కారం కష్టమైనప్పుడు వాయిదా వేయడమో జరుగుతుంది. అయితే ఈ సమావేశంలో స్పీకర్‌నిర్ణయాలు, ప్రవర్తన ప్రతిపక్షాల విమర్శలకు గురైంది. ఉదాహరణకు సభలో స్టాంపుల కుంభకోణం చర్చిస్తున్న సందర్భంలో, అలాగే ఫార్ములా వన్ కారు రేసుల గురించి చర్చిస్తున్నప్పుడు ముఖ్యమంత్రి సభలో చర్చిస్తున్న విషయానికి పరిమితం కాకుండా, యావత్ ప్రభుత్వ విధానాలను, అలాగే యావత్ హైదరాబాద్ నగర అభివృద్ధి గురించి సుదీర్ఘంగా ఉపన్యాసం చేస్తుంటే స్పీకర్ ముఖ్యమంత్రిని అదుపులో పెట్టకుండా, తాను ముఖ్యమంత్రి మాట్లాడిన విషయాలమీద వివరణలు కోరినపుడు తనను అదుపులో పెట్టడానికి స్పీకర్ ప్రయత్నించటం ఏమీబాగాలేదని, అన్యాయమని ప్రతిపక్షనాయకుడు రాజశేఖరరెడ్డి ఎత్తిచూపారు. ప్రతిపక్షం పట్ల పక్షపాత వైఖరిని అవలంబిస్తున్నారని, అధికారపార్టీ అనుకూలత ప్రదర్శిస్తున్నారని రాజశేఖరరెడ్డి సూటిగా విమర్శించినపుడు తాను తెలుగుదేశంపార్టీ సభ్యత్వాన్ని పునరుద్ధరించుకోలేదని స్పీకర్ ప్రకటించడం కొంత ఆశ్చర్యాన్నే కలిగించింది. ఎందుచేతనంటే ఈమేరకు స్పీకర్ ఎప్పుడూ సభకు అధికారికంగా తెలియచేయలేదు. అదలా వుంచితే, తెలుగుదేశం సభ్యులు ఒక పథకం ప్రకారం గోలగోలచేస్తుంటే, వారిని అదుపులో పెట్టలేకపోవడం మాత్రం స్పష్టంగా కనిపించింది. స్టాంపుల కుంభకోణం గురించి ముఖ్యమంత్రి గంటన్నరసేపు మాట్లాడినా, కృష్ణాయాదవ్ పేరును మచ్చుకు ఒక్కసారైనా ఉచ్చరించక పోవటం గమనించదగిన మరో విషయం. స్కామ్‌పై చర్చకు జవాబిచ్చిన ముఖ్యమంత్రి ఉపన్యాసం అంతా కర్నాటక, మహారాష్ట్ర ప్రభుత్వాలను విమర్శించటం ఒక ఎత్తయితే, ఆ విమర్శలన్నింటిని సమర్థించుకోవటానికి పూర్తిగా పత్రికల వార్తలమీద ఆధారపడడం విడ్డూరం. ప్రతిపక్ష సభ్యులు పత్రికలను నోట్‌చేస్తే పత్రికల వార్తలు ఆధారం కానేకావని విమర్శించే మంత్రులు, అవే పత్రికా వార్తల ఆధారంగా సోదర రాష్ట్ర ప్రభుత్వాలను విమర్శించటం ఏమాత్రం పార్లమెంటరీ సాంప్రదాయమో స్పీకరే చెప్పాలి. సభలో లేనివారిమీద విమర్శలు చేయకూడదని స్పీకర్ ఎన్నోసార్లు ప్రతిపక్షాలను హెచ్చరించారు. కేవలం తొమ్మిదికోట్ల విలువగల నకిలీ స్టాంపు పేపర్లు మాత్రం దొరికాయన్న ఒక్క విషయం ఉదహరించటం తప్ప, ముఖ్యమంత్రి ఉపన్యాసం అంతా చర్చను అనుమతించిన అంశం తప్ప మిగతా విషయాలతో ఉపన్యాసాన్ని కొనసాగించడాన్ని అనుమతించటం సభానియమాలకు పూర్తి విరుద్ధం.

నేరచరితులను చట్టసభల్లోకిరాకుండా ప్రస్తుతచట్టంలో సవరణలు తీసుకొనిరావాలట. విధానపూర్వకమైన ఆలోచన ఏదో చేస్తున్నట్లు ప్రకటనలు చేస్తున్న ముఖ్యమంత్రికి, ఏ చట్టం సవరించకుండానే అలాంటి నేరచరితులకు పార్టీ టికెట్లు ఇవ్వకుండావుంటే సమస్యే వుండదనే చిన్న విషయం ఆయనకు ఎందుకు తట్టలేదో? ఆయనకు తోచకపోతే మానె, 1999 ఎన్నికల ముందు లోక్‌సత్తా సంస్థ అభ్యర్థుల్లో 40 మంది నేరచరితులున్నారని, వారిలో తెలుగుదేశం 20, కాంగ్రెస్ 12, వామపక్షాలు ఎవరూలేరని ప్రకటన చేసినతర్వాతనైనా, వారికి టికెట్లునిరాకరించివుండివుంటే కృష్ణయాదవ్ లాంటివారు చట్టసభలోకి రాకుండా వుండేవారు. తెలుగుదేశానికి ఈ బురద అంటుకొనివుండేది కాదు. యాదవ్‌కు టికెట్ ఇవ్వడమే కాకుండా అతనికి మంత్రిత్వ పదవిని కూడా ఇచ్చి సింహాసనంమీద కూర్చోబెట్టిన ఘనత కలిగిన చంద్రబాబు చట్టం మార్చాలనే విధాన ప్రకటనను చేసి, ఆ ముసుకువెనుక తన తప్పిదాన్ని కప్పిపుచ్చుకోవడానికి ప్రయత్నిస్తున్నారని అనుకోవటం తప్పుకాదనుకొంటాను. ఇదేనా పార్లమెంటరీ సాంప్రదాయాలను పరిరక్షించే విధానం? కాంగ్రెస్‌కూ ఇలాంటి చరిత్ర లేకపోలేదు. ఆ చరిత్రను తవ్వి దానికి ఒక ఆయుధంగా ఉపయోగించుకోవడానికి ప్రయత్నించడం అంటే, మాలోనూ నేరచరితులుంటే తప్పేమిటి అని వాదించడమవుతుంది.

శాసనసభ సమావేశాలు చేపల మార్కెట్‌లా తయారయ్యాయని ప్రజలు ఇప్పటికే అనుకుంటున్నారు. మొన్నటిసమావేశానికి విలేకరిగా వెళ్ళిన నేను ఇంటికి తిరిగివచ్చేసరికి, ఇంటికి వచ్చివున్న ఒక మిత్రుడు "నువ్వు లోపలికివెళ్ళి ముందుస్నానంచేసిరా. శాసనసభనుంచి వచ్చావ్ కదా. ఆ మురికి, ఆ కల్మషం అంతా ముందు వదిలించుకొనిరా" అని అన్నాడంటే ప్రజల్లో చట్టసభలకు ఇవ్వాల్సిన గౌరవం, విలువలు మంటగలిసాయని స్పష్టమవుతుంది. ముఖ్యమంత్రి ఎనిమిది సంవత్సరాల విజయవిహారంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని మట్టికరిపిస్తున్న విషయంకూడా ఒక విజయంగా చేర్చుకోవచ్చు. ○

# కృష్ణనీటి జగడం-కొన్ని వాస్తవాలు, ఒక అభిప్రాయం

— కె. బాలగోపాల్

**కృష్ణానది** నీటిగురించి కొంతకాలంగా రాష్ట్రంలోని మూడు ప్రాంతాల లోనూ జరుగుతున్న ఆందోళనలను చూస్తున్నాం. ఎవరికి వారు మా ప్రాంతానికి నీళ్లు మొదట ఇవ్వాలని అడుగుతున్నారని అర్ధమవుతున్నదే తప్ప ఇందులో న్యాయాన్యాయాలు అర్థం చేసుకోవడానికి కావలసిన సమాచారం ప్రజలదగ్గర లేదు, పత్రికలు ఇవ్వడంలేదు.

ఒకటి మాత్రం స్పష్టం అయ్యే ఉండాలి. కృష్ణానదిలో మామూలుగా వచ్చేదానికంటే ఈ సంవత్సరం తక్కువనీళ్ళు వచ్చాయి కాబట్టి వచ్చిన నీటిని ఎవరికి ముందు ఇవ్వాలి-లేదా దానిని పంచడంలో ఎవరి అవసరాలకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వాలి. అన్న తగవు వచ్చిందని అర్థంఅయ్యేఉండాలి. ఇది ఎప్పుడైనా వచ్చిఉండగల సమస్యే కాబట్టి దీని పరిష్కారానికి ఒక నియమం ఏదీ ఇన్నాళ్లూ ఎందుకు ఏర్పరచుకోలేదు? అన్న సందేహం కూడా వచ్చే ఉండాలి.

కిందటి సంవత్సరం దేశవ్యాప్తంగా వర్షాభావ పరిస్థితులు ఉన్నసంగతి తెలిసిందే. అందువల్ల అన్ని ప్రాజెక్టులలోనూ నీటిమట్టం బాగా అడుగంటింది. శ్రీశైలం, నాగార్జునసాగర్‌ల నుండైతే కనీస నీటి నిలువ మట్టాన్ని దాటి నీటిని దిగువకు మన రాష్ట్ర ప్రభుత్వం విడుదల చేసింది. దానికితోడు ఈ సంవత్సరం కూడా కృష్ణానదికి ప్రధానంగా నీళ్లు అందిచ్చే పడమటి కనుమలలో మళ్లీ వర్షాభావ పరిస్థితులు ఉన్నాయి. మనరాష్ట్రంలో(మొత్తంమీద) సగటువర్షపాతం ఉన్నప్పటికీ కృష్ణానదిలో నీళ్లెక్కువ లేకపోవడానికి కారణం ఆ నదిలోకి నీటిని పారించే 'కాచ్‌మెంట్' ప్రధానంగా కర్నాటక, మహారాష్ట్రలలో ఉండడం, అక్కడ ఈ సంవత్సరం కూడా వర్షాభావ పరిస్థితులు ఉండడం.

కృష్ణానది మీద (దాని ఉపనదులైన కొయ్‌నా, తుంగభద్ర, భీమ, ఘటప్రభ, మూసి మొదలైననదులను కలుపుకొని) మహారాష్ట్ర, కర్నాటక, ఆంధ్రప్రదేశ్‌లు మూడింటిలోనూ ప్రాజెక్టులున్నాయి. ఈ మూడు రాష్ట్రాల్లో ఎంతెంత నీళ్లు ఆ నదినుండి తీసుకోవచ్చునో చెప్పే బచావత్ అవార్డు ఉంది.

బచావత్అవార్డు కృష్ణానదిలో నాలుగింట మూడుసంవత్సరాలు (అంటే 75 శాతం భరోసాతో) 2060 టిఎంసిల నీరు ఉంటుందని అంచనావేసి, అందులో 800ల టిఎంసిల పైన ఆంధ్రప్రదేశ్‌కు హక్కు ఇచ్చింది (695 టిఎంసిల పైన కర్నాటకకు, 565 టిఎంసిల పైన మహారాష్ట్రకు ఇచ్చింది). అంతేకాక, ప్రాజెక్టుల నుండి పొలాలకు పారించేనీటిలో కొంతభాగం తిరిగి నదిలోకి పోతుందని అంచనావేసి ఆ లెక్కకింద ఆంధ్రప్రదేశ్‌కు మరొక 11 టిఎంసిల నీటిపైన హక్కు ఇచ్చింది. అంటే ఆంధ్రప్రదేశ్‌కు 811టిఎంసిల నీటిపైన హక్కుఉంది.

టిఎంసి అంటే ఎంతో తెలుసుకోకపోతే ఈ అంకెలు సంఖ్యలు అర్థంకావు కాబట్టి ఒక టి.ఎం.సి. అంటే వందకోట్ల ఘనపుటడుగులు అని చెప్పుకోవాలి. వందకోట్ల ఘనపుటడుగుల నీటిని ఊహించుకో లేము కాబట్టి దానిని అర్థం చేసుకోవడానికి వివరణ ఇవ్వడం ఉచితంగా ఉంటుంది. మనం ఏ ప్రాంతం వారిమైనా చెరువులను చూసేఉంటాము. ఒక టి.ఎం.సి.లో మూడవ వంతు నీటివిలువ సామర్థ్యం ఉంటే చెరువు మామూలుగా పెద్ద చెరువుగా భావించబడు తుందని చెప్పుకుంటే ఒక అంచనా వస్తుందనుకుంటాము.

ఒక టిఎంసి నీటితో ఎంత పొలం సాగుఅవుతుందో తెలుసు కోవడం కూడా ఈ సందర్భాల్లో ఉపయోగపడుతుంది. ఒక టిఎంసి నీటిని మాగాణి (తరి) సాగుకు వాడేటట్టయితే 6000 ఎకరాలకు, ఆరుతడి (ఇరిగేటెడ్ డ్రై) పంటకు పెట్టేటట్టయితే 10,000 ఎకరాలకు సరిపోతుందని అంచనా. ఇతర నీటివనరులతోకలుపుకొని పొదుపుగా వాడుకునేటట్టయితే ఇంకా ఎక్కువ భూమికి పారించుకోవచ్చునని వేరే చెప్పనవసరం లేదు.

ఇప్పుడు మన రాష్ట్రం ఎదుర్కొంటున్న సమస్యను తిరిగి ప్రస్తావిద్దాం. నాలుగింట మూడు సంవత్సరాలు నదిలో 2060 టిఎంసిల నీరు ఉంటుందని అంచనావేసి మూడు రాష్ట్రాలకు పైన చెప్పిన పద్ధతిలో బచావత్ అవార్డు పంచిందని చెప్పుకున్నాము. ఆ 2060 టిఎంసిల మేరకు ప్రాజెక్టులు కట్టేసుకున్న తరువాత ఏ సంవత్సరమైనా నదిలో అంతకంటే తక్కువ నీళ్ళువస్తే ఏమవుతుంది? నాలుగింట ఒక సంవత్సరం అది జరిగే అవకాశం వుందని బచావత్ అవార్డే అంటుంది కాబట్టి ఇది వేసుకోనక్కరలేని ప్రశ్నకాదు.

బచావత్ అవార్డు మూడురాష్ట్రాల మధ్య నదినీటిని పంపిణీచేసే తీర్పే తప్ప రాష్ట్రంలోపలి విషయాలతో దానికి ప్రమేయం లేదు. రాష్ట్రాల మధ్య ఏం జరుగుతుందంటే ఎగువ రాష్ట్రం తన అవసరాల మేరకు తన ప్రాజెక్టులలో నీళ్ళు నిలుపుకున్న తరువాతే దిగువకు నీళ్లు పంపుతుంది.

మరి రాష్ట్రంలోపల ఏం జరుగుతుంది? బచావత్ అవార్డులో దానికి జవాబులేదు. ఒక రాష్ట్రానికి కేటాయించిన నీటివాటాను ఆ

రాష్ట్రం తన సరిహద్దుల లోపల ఏవిధంగా పంచుకుంటుందనే విషయంలో దానికి స్వేచ్ఛ ఉంటుందని బచావత్‌అవార్డు అంటుంది. ఆల్మట్టి కేసులో ఇదే విషయాన్ని సుప్రీంకోర్టు ధృవీకరించింది.

స్వేచ్ఛ ఉన్నచోట బాధ్యతకూడా ఉంటుందని వేరే చెప్పనవసరం లేదు. నీళ్ళు తక్కువ వచ్చిన సంవత్సరం రాష్ట్రంలోని ప్రాజెక్టులమధ్య దానిని ఏవిధంగా పంచాలి? పై ప్రాజెక్టు తన అవసరాల మేరకు నిలుపుకున్న తరువాతే కిందికి పంపించాలా? లేకపోతే వచ్చిన నీటిని వచ్చినట్టు ఒక నిర్దిష్ట నిష్పత్తిలో అన్ని ప్రాజెక్టులకూ పంచాలా? రెండవదే జవాబైతే ఏ నిష్పత్తిలో పంచాలి? ఆయా ప్రాజెక్టుల సామర్థ్యం నిష్పత్తిలో పంచాలా? లేకపోతే కరువు ప్రాంతాలకు కొంచెం ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చే పద్ధతిలో నిష్పత్తిని నిర్ణయించాలా?

దీనికి అధికారికంగా ఏ జవాబూ లేదు. ఇన్నేళ్ళలో ఈ ప్రశ్నలకు జవాబుచెప్పే ఒక విధానం గానీ, ఒక ఆనవాయితీ గానీ-చట్టం సంగతి సరేసరి-మన రాష్ట్ర పాలకులు రూపొందించలేదు. గడచిన నెలరోజులుగా మచిలీపట్నం నుండి మిర్యాలగూడెం దాకా, మిర్యాలగూడెం నుండి నంద్యాల దాకా ధర్నాలు, నిరాహారదీక్షలు చేపట్టిన రాజకీయపార్టీలు దీనిగురించి ప్రభుత్వాన్ని అడగవలసింది. కానీ ఈ పాపంలో అందరికీ భాగం ఉంది కాబట్టి అడగకుండా జాగ్రత్తపడ్డారు. ఒకే పార్టీనాయకులు నంద్యాలలో ఒక డిమాండుతో, మిర్యాలగూడెంలో ఇంకొక డిమాండుతో, మచిలీపట్నంలో వేరొక డిమాండుతో ఆందోళన చేపట్టారు. ఈ మూడు నాల్కల వైఖరికి ఏ పార్టీ మినహాయింపు కాదు.

ఏ నియమమూ లేకపోయినా ఇటువంటి సంక్షోభం ఇన్నాళ్ళూ తలెత్తకపోవడానికి కారణం కర్నాటక తనవాటానీటిమేరకు ప్రాజెక్టులు కట్టుకోవడానికి తొందరపడకపోవడం. 1990ల మధ్యభాగం దాకా కర్నాటక తన నీటిహక్కుల విషయంలో తాత్సారం చేస్తూ ఉండింది (ఇది ఆ రాష్ట్రంలోని ప్రాంతీయ అసమానతలతో ముడిపడివున్న విషయం). అంతేకాకా మనరాష్ట్రం వాటాలో కొత్తగా మంజూరైన జూరాల, శ్రీశైలం కుడిగట్టుకాలువ ప్రాజెక్టులు నత్తనడక నడుస్తూ వున్నాయి. అందువల్ల బెజవాడ దగ్గర కృష్ణా డెల్టాకు కేటాయించిన నీటివాటా కంటే సగటున 400 టిఎంసిలు ఎక్కువనీరు మూడేళ్ళ కిందటివరకు కృష్ణానదిలో లభ్యమయ్యేవి. తీవ్ర వర్షాభావ సంవత్సరాలలో సహితం కృష్ణా డెల్టాకు తనవాటా కంటే 100 టిఎంసిలకు తక్కువ కాకుండా అదనపు నీరు లభించేది. ఆల్మట్టి పూర్తయిన తరువాతే తనవాటాకు కొంచెం ఇటూఅటూగా మాత్రమే నీళ్ళు లభించే సగటుస్థితి డెల్టాకు వచ్చింది. ఈ సంవత్సరం నెలకొన్న అసాధారణ పరిస్థితులలో అందరిలాగా వారికి కూడా సాగునీటికి కటకట అయింది.

ఏ నియమమూ లేకపోతే ఏమవుతుందంటే బలవంతుల ఆటలే సాగుతాయి. ఒక నెలరోజులుగా రాష్ట్రంలో ఇదే చూస్తున్నాం. 'ఏమైనా సరే డెల్టా భూములను కాపాడుతాం' అని ముఖ్యమంత్రి పదేపదే ప్రకటిస్తున్నాడు. డెల్టా రైతులు కూడా రైతులే, వారికీ ప్రభుత్వం చేయూత ఇయ్యవలసిందే గానీ వారు మాత్రమే రైతులా? ఎగువప్రాంతం వ్యవసాయాన్ని కాపాడే బాధ్యత ప్రభుత్వానికి లేదా? ప్రభుత్వం అందరినీ కాపాడవలసిందే, నీటివనరులైనా ఏ వనరులైనా అందరికీ తగుమోతాదులో అందియ్యవలసిందే. కానీ అది నియమబద్ధంగా ఉండాలి, ఆ నియమం న్యాయంగా ఉండాలి, ఆ న్యాయానికి ఒక ఉచితమైన ప్రమాణం ఉండాలి. వీటి దాఖలాలేవైనా ఈ నెలరోజులలో కనిపించాయా?

కడప, కర్నూలు జిల్లాలకు శ్రీశైలం రిజర్వాయర్ నుండి ఒక చుక్కనీరు ఇయ్యాలన్నా శ్రీశైలంలో నీటిమట్టం 854 అడుగులు ఉండాలి. ఆ జిల్లాల ఆయకట్టుదార్ల అవసరాలు పూర్తిగా తీర్చడానికి కాదు, ఒకచుక్క నీరియ్యాలన్నా శ్రీశైలం రిజర్వాయర్‌లో నీటిమట్టం 854 అడుగులు ఉండక తప్పదు. పోతిరెడ్డిపాడు 'టేక్-ఆఫ్' లెవెలే అంత. ఆ జిల్లాలవాళ్ళు ఆ మాట అంటే ముఖ్యమంత్రి సెప్టెంబర్ 15 దాకా శ్రీశైలం నుండి నీళ్ళు కిందికి వదలబోమని హామీ ఇచ్చాడు. సెప్టెంబర్ 15 నాటికి నీటిమట్టం 854 అడుగులు చేరుకోకపోతే ఏం చేస్తారో మాత్రం చెప్పలేదు.

ఇది సెప్టెంబర్ మొదటి దినాలలో అయితే ఒకవారం తిరగక ముందే ముఖ్యమంత్రి కృష్ణాజిల్లాకు పోయి వెంటనే శ్రీశైలం రిజర్వాయర్ నుండి నీళ్లు కిందికి విడిచిపెడతామని హామీ ఇచ్చాడు. ఈ హామీ వెంటనే అమలయింది కూడా (అయినప్పటికీ అవసరాలకు చాలినంత రాలేదనీ ఇంకా విడిచి పెట్టమనీ డెల్టా నాయకులు అందోళన కొనసాగించారు-అది వేరే సంగతి).

శ్రీశైలం నుండి కిందికి ప్రవహించే కృష్ణానది నీళ్ళు నేరుగా బెజవాడకు పోవు. మధ్యలో నాగార్జునసాగర్ ఉంది. దానికి కుడి, ఎడమ కాలువలున్నాయి. గుంటూరు, ప్రకాశం జిల్లాలకు నీళ్ళిచ్చే కుడికాలువకు కొంచెం దిగువనుండే నీళ్ళు అందుతాయి గానీ సాగర్‌లో నీటిమట్టం 510 అడుగులుంటే తప్ప నల్గొండకూ, ఖమ్మంకూ (కొంచెం కృష్ణాజిల్లా మెట్ట తాలూకాలకు కూడ) నీళ్ళిచ్చే ఎడమ కాలువకు నీళ్లుండవు. ఆపైన కూడా నీళ్లుంటే తప్ప. ఈ మధ్యనే రాష్ట్రప్రభుత్వం నల్గొండకు వరమంటూ ఆర్భాటంగా ప్రకటించిన ఎలిమినేటి మాధవరెడ్డి కాలువకోసం నీళ్ళు ఎత్తిపోసి నిలువవుంచే అక్కంపల్లి రిజర్వాయర్ కనీసం తడవదు. ముఖ్యమంత్రి కృష్ణాజలాల వివాదం గురించి చేసిన ప్రకటనలలో ఈ అవసరాల ప్రస్తావన సహితం లేదు.

(తరువాయి భాగం 13వ పేజీలో)

# నిత్యజీవితంలో బహుళజాతి సంస్థలు - 5

— ఎన్. వేణుగోపాల్

**బహుళజాతి సంస్థల** సరుకుల అమ్మకాలకు ఎప్పుడూ లక్ష్యంగా అమాయకులు, సులభంగా ఆకర్షణలకు లోనయ్యేవారు ప్రచార ఆర్భాటానికి మైమరిచిపోయేవాళ్ళు ప్రధానంగా ఉంటారు. నిత్యజీవితావసర సరుకుల మార్కెట్లను శాసించడం ఒక ఎత్తైతే అవసరమే లేని సరుకులను సృష్టించి ఇటువంటి వర్గాలకు చేరవేసి లాభాలను గడించడం మరోఎత్తు. అందుకే బహుళజాతి సంస్థలు ప్రధాన కార్యక్షేత్రాలలో పిల్లలకు అవసరం అయిన, అవసరమైనవని భ్రమకల్పించేవి ఉత్పత్తిచేయడం ముఖ్యాంశం. ఇటీవలికాలంలో ఇబ్బడిముబ్బడిగా పెరిగిన పిల్లల వస్తువుల దుఖానాలు వాటిలో పాలసీసాల నుంచి పొత్తిళ్ళనుంచి దుస్తుల వరకు కంప్యూటర్ గేమ్స్ వరకు పిల్లలను లక్ష్యంగా పెట్టుకున్న బహుళజాతి సంస్థల సరుకులు కోకొల్లలు. పిల్లల పెంపకం బాల్యకౌమార దశల్లో అవసరమయ్యే వస్తువులు ఏ సమాజానికి కొత్తగా పరిచయం చేయనక్కరలేదు. తరతరాలుగా మానవ సమాజం పిల్లల పోషణకు సంబంధించిన జ్ఞానాన్ని అభివృద్ధి చేసుకుంటూ వస్తుంది. కాని ఇప్పుడు హఠాత్తుగా బహుళజాతి సంస్థలు ఆ జ్ఞానాన్నంతా తోసిరాజని తమకు తెలిసినదే తమ సరుకుల అమ్మకాలకు సహకరించేదే జ్ఞానమని ప్రవచిస్తున్నారు. పిల్లలు ఎటువంటి పాలు ఆహారం తీసుకుంటే సరైన పోషణ పొందుతారో దగ్గరనుంచి ఎటువంటి దుస్తులు వేసుకోవాలో ఎటువంటి ఆటలు ఆడాలో బహుళజాతి సంస్థలు నిర్దేశిస్తున్నాయి.

భారతదేశం విషయానికొస్తే అధికారిక గణాంకాల ప్రకారమే దేశవ్యాప్తంగా పిల్లల సంఖ్య దాదాపు 20 కోట్లు. వారిలో కనీసం రెండుకోట్ల మంది పిల్లల తల్లిదండ్రులకు కొనుగోలుశక్తి ఉన్నదని అంచనావేసినా ఇది సువిశాలమైన మార్కెట్. బహుశా ప్రపంచంలో ఏ దేశంలోనూ లేనంత పెద్ద మార్కెట్. అందువల్ల ఈ మార్కెట్‌లో ప్రవేశించడానికి విస్తరించడానికి బహుళజాతి సంస్థలు తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నాయి.

నిజానికి వాళ్ళు అటువంటి తీవ్రప్రయత్నాలు ఏమీచేయనవసరం లేదు. సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక కారణాలు వాళ్ళ ప్రవేశానికి రంగం సిద్ధం చేస్తున్నాయి.

పిల్లల పట్ల తల్లిదండ్రుల శ్రద్ధాసక్తులు పిల్లల పోషణ గురించి తల్లిదండ్రులకు ఉండే జాగ్రత్త ఎవరు ఎటువంటి సరుకునందచేసినా తీసుకోవడానికి వీలుకల్పిస్తాయి. అట్లాగే పిల్లలకు అవసరం అయిన వస్తువుల విషయంలో ధర గురించి తల్లిదండ్రులు ఎక్కువ ఆలోచించని పరిస్థితి ఉంటుంది. తమ అవసరాలు ఇతర ఖర్చులు తగ్గించుకొనిఅయినా పిల్లల అవసరాలు చూడాలని తల్లిదండ్రులు అనుకోవడం వల్ల పిల్లల వస్తువుల మార్కెట్ ఎప్పుడు లాభసాటిగా ఉంటుంది. ఉత్పత్తి వ్యయానికి, ధరకు మధ్య ఎంత అంతరం ఉన్నా ప్రతిఘటనలేని స్థితి ఉంటుంది. ఈ కారణాలన్నింటికి తోడు పిల్లలవస్తువుల గురించి పిల్లలసాయంతోనే వ్యాపార ప్రకటనలిప్పిస్తే అవి పిల్లలమీద తీవ్రమైన ప్రభావాన్ని చూపుతాయి. ఆ వస్తువులు కావాలని తల్లిదండ్రుల మీద పిల్లలు పెట్టే డిమాండు పెరిగిపోతుంది. వీటన్నింటికితోడు పిల్లల వస్తువులు తయారుచేసే బహుళజాతి సంస్థలు చాలాదేశాల ప్రభుత్వాలకన్నా సంపన్నమైనవి శక్తివంతమైనవి గనుక అవి ఆయాదేశాల రాజకీయార్థిక విధానాలను తమకు అనుగుణంగా మార్చుకోగలుగుతాయి.

ఈసారి పిల్లల వస్తువుల్లో ముఖ్యమైన పోషకాహార పదార్థాల మార్కెట్‌ను చూద్దాం. తల్లిపాలకు ప్రత్యామ్నాయాలు, పాలలో కలిపే పొడులు పోషకపదార్థాల సమ్మేళనాలువంటి ఎన్నో సరుకులు ఇవాళ మార్కెట్‌లో దొరుకుతున్నాయి. వీటిని మార్కెట్ పరిభాషలో ఆరోగ్య పానీయాల మార్కెట్ అంటారు. ఒక అంచనా ప్రకారం దేశంలోని మొత్తం ఆహారపదార్థాల వినియోగంలో ఈ మార్కెట్ ఇవాళ ఒక్క శాతంగాఉంది. అంటే ఈ మార్కెట్ విస్తరించడానికి చాలాఅవకాశాలు ఉన్నాయని ఆరోగ్యపానీయాల వ్యాపారం వందలకోట్ల రూపాయలు విస్తరించడానికి అవకాశాలు ఉన్నాయని మార్కెట్ సర్వేలు తెలుపుతున్నాయి. ఈ ఉత్పత్తులలో హార్లిక్స్, బూస్ట్, వివా, మాల్టోవా, బోర్నవిటా, మిలో, కాంప్లాన్ వంటివెన్నో ఉన్నాయి. మరోవైపు తల్లిపాలకు ప్రత్యామ్నాయంగా సెరిలాక్, పారెక్స్, లాక్టోజెన్ లాంటి బహుళజాతి సంస్థలు, అమూల్ లాంటి స్వదేశీ సహకారరంగ ఉత్పత్తి మార్కెట్‌లో ఉన్నాయి. తల్లిపాల ప్రత్యామ్నాయాలను పక్కనపెడితే ఇతర ఆరోగ్య పానీయాల మార్కెట్ తొంభైశాతం బహుళజాతిసంస్థల చేతిలో ఉంది. స్మిత్‌క్లైమ్ బీచమ్ (హార్లిక్స్, బూస్ట్, వివా, మాల్టోవా ఉత్పత్తిదారుడు) 70 శాతం మార్కెట్‌ను ఆక్రమించగా క్యాడ్‌బరీ (బోర్నవిటా), హీన్జ్ (కాంప్లాన్) చేతుల్లో చేరి పన్నెండుశాతం మార్కెట్ నెసిల్ (నిలో) చేతుల్లో మూడుశాతం మార్కెట్ ఉందని ఒక అంచనా.

దేశంలో మొత్తం మార్కెట్ సైజ్ సాలీనా 82 వేల టన్నులు. ఒక శిశువుకు నెలకు ఒక డబ్బా లేదా సీసా అవసరం అనుకుంటే మార్కెట్‌లో 200 గ్రాము/మిల్లీ సీసా 50 రూపాయల నుంచి 120 రూపాయల వరకు ఉంది. ఈ లెక్కన మొత్తం మార్కెట్‌ఖరీదు రెండువేల కోట్ల రూపాయల నుంచి నాలుగువేల కోట్ల రూపాయల వరకు ఉంటుంది. ముందే చెప్పినట్లు ఈ సరుకులలో లాభాలరేటు చాలా ఎక్కువ గనుక లాభం కనీసపక్షం 500 కోట్ల పైచిలుకే. అతితక్కువ శ్రమతో మార్కెటింగ్ ప్రయత్నాలతో ఇంత విస్తృతమైన

లాభాలు సంపాదించే అవకాశం ఉంది గనుక బహుళజాతి సంస్థలు ఈ రంగంమీద చాలా శ్రద్ధచూపుతున్నాయి. అమూల్ లాంటి స్థానిక ఉత్పత్తులను దెబ్బతీయడానికి, తమ మార్కెట్ ఆధిపత్యాన్ని విస్తరించు కోవడానికి అన్నిరకాల కుటిలప్రయత్నాలకు ఆకర్షణీయమైన వ్యాపార ప్రకటనలకు పూనుకుంటున్నాయి. ఇవాళ ఏ టెలివిజన్ ఛానల్ చూసినా అతి ఎక్కువ ప్రకటనలు ఈ ఆరోగ్య పానీయాల గురించే కనబడుతాయి. క్రికెట్ క్రీడాకారులు సచిన్ టెండూల్కర్ తన విజయ రహస్యం బూస్టేనని చెబుతాడు. పిల్లవాడు సరిగ్గా ఎదగడానికి కాంప్లాన్ కారణమని మరో ప్రకటన చెబుతుంది. ఇటువంటి ప్రకటనల ద్వారా పిల్లల లేతమనసులపై ప్రభావం వేసి తమసరుకుల అమ్మకాలను పెంచుకోవడం బహుళజాతి సంస్థల లక్ష్యం. స్విట్జర్లాండ్‌కు చెందిన నెస్లే ఈ ఆరోగ్య పానీయాలతోపాటు అనేక ఆహార పదార్థాల మార్కెట్ ఉంది. 87 దేశాలకు విస్తరించిన ఈ బహుళజాతి సంస్థలు వందదేశాల్లో ఉత్పత్తులను అమ్ముతూ 5వేల రెండువందల కోట్ల డాలర్ల (2 లక్షల యాభైవేల కోట్ల రూపాయలు) అమ్మకాలను, 311 కోట్ల డాలర్ల (1500 కోట్ల రూపాయలు) లాభాన్ని సాలీనా పొందుతుంది. 8 వేల 5 వందల రకాల ఉత్పత్తులను సాగించే ఈ సంస్థ తనగజబలంతో ఇతరదేశాల మార్కెట్‌లలో ప్రవేశించి చిన్న ఉత్పత్తిదారులను ధ్వంసంచేసి తన మార్కెట్‌ను స్థాపించుకుంటుంది. దానికి పోటీదార్లయిన స్మిత్‌క్లైన్ బీచమ్, హిన్జ్, క్యాడ్‌బరీ సంస్థలు కూడా అందుకు తక్కువ తిన్నవేమీ కావు. ఈ నాలుగు సంస్థల మధ్య భారతమార్కెట్ కోసం తీవ్రమైన పోటీలు జరుగుతున్నాయి.

ఈ పోటీలో భాగంగా దాదాపు ఈ అన్ని పౌడర్‌లలోను కోకో పౌడర్ కలుపుతున్నారు. నిజానికి ఈ కోకో పౌడర్ ఒక మత్తుమందు. ఆ పదార్థాలను అలవాటు చేయడానికి, అది మానలేని వ్యసనంగా మార్చడానికి ఈ కోకో కలుపుతుండగా అది మొత్తం శరీరఆరోగ్యానికే హాని కలిగిస్తుంది. ఈ కోకో మిశ్రమం గురించి యునిసెఫ్ ప్రపంచ ఆరోగ్యసంస్థ వంటి అంతర్జాతీయ సంస్థలు ఎన్నోసార్లు నిరసన ప్రకటించినా బహుళజాతి సంస్థలకు చీమకుట్టినట్లైనా లేదు.

ఈ పాల ఉత్పత్తులు పాలలో కలుపుకునే పదార్థాలు ఒక ఎత్తైతే అక్కడినుండి ఎదుగుతున్న పిల్లలకు మప్పుతున్న చాక్‌లెట్లు, బిస్కెట్ల మార్కెట్ మరింత విస్తృతమైనది. బహుళజాతి సంస్థలకు మరిన్ని లాభాలను సమకూర్చిపెడుతున్నది. ఆ మార్కెట్ గురించి మరో అధ్యాయంలో పరిశీలిద్దాం.

కాని ఈ ఆహారపానీయాల రంగం వరకు మాత్రమే చూసినా ప్రభుత్వాలు నియంత్రణ సంస్థలు తల్లిదండ్రులు తీవ్రంగా పట్టించుకో వలసిన సమస్య ఇది. ఏ సమాజానికైనా భవిష్యత్‌తరం గొప్పఆస్తి. ఆ భవిష్యత్‌తరం ఆరోగ్యవంతంగా ఆహ్లాదకరంగా సామాజిక శ్రేయోదాయకంగా పెరగాలని ఏ సమాజమైన కోరుకుంటుంది కోరుకోవాలి. కాని ఇవాళ ఆరోగ్యం పేరుతోనే అనారోగ్యాన్ని వ్యాపింపచేసే విటమిన్ల ఆహారంతో సంతులిత ఆహారం పేరుతో విషపదార్థాలు అందించడం ఆహ్లాదకరమైన వాతావరణాన్ని సామాజిక శ్రేయస్సు భావలనలను కల్పించకపోవడం ఇవాళ ఈ దేశంలో పాలకనీతిగా అమలవుతున్నది. ఈ పాలకనీతి బహుళజాతి సంస్థల రంగప్రవేశానికి దారులు తీస్తున్నది. ❍

(11వ పేజీ తరువాయి భాగం)

ఈ విషయాలన్నీ దృష్టిలో ఉంచుకుంటే తప్ప రాష్ట్రంలోని మూడు ప్రాంతాలలో నెలరోజులుగా సాగుతున్నఆందోళనలను అర్థంచేసుకో లేం. అర్థంచేసుకోకపోతే అన్నిఆందోళనలనూ ఒకేగాటనకట్టి నిందించ డమో, అభినందించడమో జరుగుతుంది. అది అవాంఛనీయం.

కృష్ణానదిలో నీళ్లు తక్కువ ఉన్నప్పుడు దానిని భిన్న ప్రాజెక్టుల మధ్య ఏ ప్రాధాన్యతలఆధారంగా పంచాలో నిర్ధారించే నియమావళిని రాష్ట్ర ప్రభుత్వం రూపొందించాలనీ, ఆ నియమావళి అందరి అవసరాలనూ లెక్కలోకి తీసకుంటూ, కరువు ప్రాంతాల ప్రాజెక్టుల అవసరాలకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చేదిగా ఉండాలనీ, ఈ సమస్య ఎప్పుడొచ్చినా ప్రభుత్వం ఏ ఒత్తిడులకూ లొంగకుండా ఈ నియమావళి ప్రకారం నడుచుకోవాలనీ, అందుకోసం ఒక స్వతంత్రమైన రెగ్యులేటరీ కమిషన్‌ను నెలకొల్పాలనీ డిమాండ్ చేయడం అవసరం. ఆ డిమాండ్‌ను సాధించుకోవడం అవసరం.

అయితే కృష్ణాజలాలకు సంబంధించిన అసలు సమస్య ఇదికాదు. మన రాష్ట్రంలో భిన్న ప్రాంతాల మధ్య ఆ నదినీటిలో మన వాటాగా వచ్చిన 800 (లేక 811) టిఎంసిల నీటిని పంపిణీచేసిన విధానమే అన్యాయమైనది. కోస్తా ఆంధ్రకు 377 టిఎంసిలు, తెలంగాణకు 267 టిఎంసిలు, రాయలసీమకు 123 టిఎంసిలు పంపిణీ చేశారు. తెలంగాణకు ఇచ్చిన 267టిఎంసిలలో చెప్పుకోదగ్గమొత్తం కాగితాల మీద తప్ప ఎక్కడున్నాయో తెలియని మైనర్ ఇరిగేషన్ ప్రాజెక్టులకు కేటాయించబడ్డాయి.

ఈ పంపిణీ ఏరకంగా చూసినా అన్యాయమైనది. వర్షపాతం, భూగర్భజలాలు ఎక్కువ ఉన్న ప్రాంతానికి ఎక్కువ నదినీరు, తక్కువ ఉన్న ప్రాంతాలకు తక్కువ నదినీరు కేటాయించడం అన్నిటికంటే ప్రాథమికమైన అన్యాయం. దీనిని ఇప్పటికైనా సవరించి, వర్షాభావం, కరువు, పేదరికం అధికంగా ఉన్న తెలంగాణ, రాయలసీమ ప్రాంతాలకు నీళ్లిచ్చే పెండింగ్ ప్రాజెక్టులకు నీటిని ఒక హక్కుగా కేటాయించడం ద్వారా కృష్ణానది నీటిని పునఃపంపిణీ చేయాలని డిమాండ్ చేస్తూ ఉద్యమించడం అవసరం. అప్పుడుగానీ నీటిహక్కుల విషయంలో న్యాయం జరగదు. ❍

# గొంతు తడారుతుంటే శీతల పానీయాలకు మంచినీటి సరఫరా!

— డా॥ సి. రామచంద్రయ్య
రీడర్, సెస్ సంస్థ, హైదరాబాద్.

**కోకాకోలా,** పెప్సీ కంపెనీలు సరఫరాచేస్తున్న శీతలపానీయాల్లో క్రిమి సంహారకాలు, ఆరాగ్యానికి హానికరమైన రసాయనాలు ఎంత పెద్ద మోతాదులో వున్నాయో బహిర్గతం చేస్తూ న్యూఢిల్లీలోని 'సెంటర్ ఫర్ సైన్స్ అండ్ ఎన్విరాన్‌మెంట్' (సి.యస్.ఇ.) ఇచ్చిన ప్రకటన తర్వాత జరుగుతున్న పరిణామాలను గత కొద్దిరోజులుగా మనం చూస్తూనే వున్నాం. ఈ సందర్భంగా కొన్ని కొత్త విషయాలు కూడా వెలుగులోకి వస్తున్నాయి.

ఈ శీతల పానీయాల్లో మోతాదుకు మించి బాక్టీరియా వున్నట్లు మే నెలలోనే (అంటే సి.యస్.ఇ. ప్రకటనకు మూడునెలల ముందే) జరిపిన పరీక్షలలో తేలినట్లు హైదరాబాదులోని 'ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ప్రివెంటివ్ మెడిసిన్'(ఐ.పి.యమ్.) వారు తెలిపారు. ఇందులో నేను గణాంకాలలోకి వెళ్ళదంలేదు. ఆయా కంపెనీలమీద తగిన చర్యలు తీసుకోవలసిందిగా నగరపాలక సంస్థను (యం.సి.హెచ్.) కోరినట్లు కూడా ఐ.పి.యమ్. తెలిపింది. నగరప్రజల ప్రాథమిక ఆరోగ్యానికి బాధ్యతవహించవలసిన నగరపాలకసంస్థ ఈవిషయాన్ని దాచిపెట్టింది. తనకుతానుగా బహిర్గతం చేసి ప్రజలను అప్రమత్తం చేయలేదు. రోజూ లక్షల లీటర్లలో అమ్ముడుపోతున్న ఈ శీతల పానీయాలలో ఎక్కువశాతం బాక్టీరియా వుందని నిర్ధారణ అయిన తరువాత కదా యుద్ధ ప్రాతిపదికన చర్యలు చేపట్టకుండా ఆయా సంస్థలకు నోటిసు లిచ్చినామంటూ కాలయాపన చేస్తున్నది.

## మంచినీటి దగా

హైదరాబాదు నగరానికి రెండు ప్రధాన నీటివనరులైన ఉస్మాన్ సాగర్, హిమాయత్‌సాగర్‌లు మొదటిసారిగా ఈ సంవత్సరం ఎండి పోయినాయి. ప్రజలు తాగునీటికి తీవ్రఎద్దడిని అనుభవించారు. అనేక ప్రాంతాలలో కలుషిత నీటివలన అతిసార, డయేరియా మొదలగు రోగాలకు ఫిబ్రవరి–ఆగస్టు 2003ల మధ్య దాదాపు 35 మంది మరణించారు. కొన్న వందలమంది ఆసుపత్రులలో చేరారు. వీళ్లంతా కూలీపని లేదా చిన్నచిన్న వ్యాపారాలు చేసుకొని బ్రతికేవాళ్ళే. మెట్రో వాటర్‌బోర్డు ట్యాంకర్ల ద్వారా అందించే నీరు చాలక, సరైన సమయానికి నీరు అందక ప్రజలు విలవిలలాడుతున్నారు. కానీ చడీ చప్పుడు లేకుండా వాటర్‌బోర్డు చేస్తున్నదేమిటి? ప్రతిరోజు 10 లక్షల శుద్ధిచేసిన మంజీరానీటిని లీటరు రెండున్నర పైసలకు కోకాకోలాకు అమ్ముతున్నది. ఈ వార్త వెలువడిన తర్వాతకూడా వాటర్‌బోర్డు అధికారుల నుండి కాని, దానికి అధ్యక్షుడిగా వున్న ముఖ్యమంత్రి నుంచి కాని ఎటువంటి వివరణ, సంజాయిషీ రాలేదు.

దీనినిబట్టి రాష్ట్రప్రభుత్వంమీద బహుళజాతి సంస్థల పలుకుబడి ఎంత బలీయంగావున్నదో ఊహించవచ్చు. సామాన్యప్రజానీకంమీద యూజర్ ఛార్జీల మోత మ్రోగించే ప్రభుత్వం కోకాకోలాకు రెండున్నర పైసలకే లీటరు నీటిని విక్రయిస్తున్నదంటే ఇంతకన్నా మోసం, దగా ఏముంటుంది. అదేనీటిని 'కిన్లే' బ్రాండుతో లీటరు రూ. 12 నుంచి రూ. 15 వరకు కోకాకోలా అమ్ముతున్నది. శీతల పానీయాల ధర ఇంకా ఎక్కువ.

ప్రజలలో చైతన్యం తక్కువగా వుండడం, ప్రజారోగ్యం పట్ల చట్టాలు పేలవంగా వుండడం, ఒకవేళ వుంటే అందులో ఎన్నో లొసుగులు, రాజకీయ నాయకుల, అధికారుల బాధ్యతా రాహిత్యం, విపరీతమైన అవినీతి వగైరా అన్నీ కలిసి దొరికినంత దోచుకునే పరిస్థితులు ఏర్పడ్డాయి. అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఎక్కువగా మరణాలకు కారణమవుతున్న 37 వ్యాధులలో 21 వ్యాధులు తాగునీరు, పారిశుద్ధ్యానికి సంబంధించినవి. ప్రజలకు నాణ్యమైన మంచినీరు అందించవలసిన బాధ్యత ప్రభుత్వాలపై వున్నది. నీరు లేనిదే జీవనం లేదు. ఈ బాధ్యతను సక్రమంగా నిర్వర్తించాలనే ఏ నాగరిక ప్రభుత్వం కూడా అది నెరవేరకుండా బహుళజాతి సంస్థలకు అంత చౌకగా నీరు సరఫరా అవుతుంటే నగరంలోనే అనేక ప్రాంతాలలో కలుషితనీరు సరఫరా అవుతుంటే నగరంలోని ప్రజా ప్రతినిధులకే అంతంతమాత్రం స్పందన వున్నప్పుడు ఎమ్.ఎన్.సి.లు మాత్రం ఎందువలన నాణ్యతా ప్రమాణాలు పాటిస్తాయి?

అంతేకాదు, బహుళజాతి సంస్థల వ్యాపారాలు నడపడానికి కార్పొరేటు మేనేజర్లను తయారుచేసేందుకు 250 ఎకరాల ప్రజల భూమిలో ఏర్పాటుచేసిన 'ఇండియన్ స్కూల్ ఆఫ్ బిజినెస్' (ఐఎస్‌బి)కు కూడా అతి తక్కువధరకే వాటర్‌బోర్డు మంచినీటిని సరఫరాచేస్తున్నట్లు తెలుస్తున్నది. హైదరాబాదులోని ఏ పెద్ద హోటల్‌కు నీటికొరతలేదు.

అనేకప్రాంతాలలో శీతల పానీయాల విక్రయాలు గణనీయంగా పడిపోయినట్లు వార్తలు వస్తున్నాయి. ఈ సంవత్సరం ఏప్రిల్ నెలలో ఇదే సి.యస్.ఐ. సంస్థ ప్రైవేటు కంపెనీల అమ్ముతున్న బాటిల్‌నీళ్ళలో క్రిమిసంహారకాలు వున్నట్లు బహిర్గతం చేసింది. కొద్దిరోజులు వాటి అమ్మకాలు పడిపోయాయి. ఆ తర్వాత మామూలే. ఈసారి అలా కాదన్న నమ్మకం లేదు. ఎందుకంటే వాటిద్వారావున్న ప్రమాదాన్ని బట్టిచూస్తే శీతల పానీయాల అమ్మకాలు చాలా గణనీయంగా పడిపోవలసివుంది. అనుకున్నంతగా పడిపోవడంలేదు.

## ప్రకటనల అనైతికత

క్రికెట్ ఆటగాళ్ళు, సినీతారలు శీతల పానీయాలు సేవించడాన్ని ప్రోత్సహిస్తూ ముఖ్యంగా టెలివిజన్ ద్వారా జరుపుతున్న ఉధృత ప్రచారం ఎంత అనైతికమైనదో, మోసపూరితమైనదో గమనించండి. ఒక వస్తువును ప్రజలలో అమ్మడానికి ప్రచారం చేయాలంటే దానిలోని సుగుణాలను వివరించి నిర్ణయాన్ని ప్రజలకు వదిలివేయాలి. కాని నేడు జరుగుతున్నదేమిటి? శీతల పానీయాలు సేవిస్తే ఆరోగ్యానికి మంచిదని ఇప్పటివరకు ప్రపంచంలో ఎవరుకూడా చెప్పినదాఖలాలు లేవు. కాబట్టి తారలకున్న ప్రాచుర్యాన్నిబట్టి మధ్యతరగతి,అల్పాదాయ వర్గాల్లో వాళ్ళపట్ల వున్న విపరీతమైన క్రేజ్‌మీద ఆధారపడి వాటి ప్రచారం జరుగుతున్నది.

వాటిని సేవించడం ఆరోగ్యానికి మంచిదికాదని వాళ్ళకు తెలియదా. ఏ శీతల పానీయాలనైతే ప్రజలను తాగమంటున్నారో వాటిని ఆ తారలు తాగుతున్నారు. ఒకరోజు ఉదయం దూరదర్శన్‌లో ఫిజికల్ ఫిటెనెస్, ఆరోగ్యం గురించి మాట్లాడుతూ మాజీ క్రికెటర్ మనీందర్‌సింగ్ ఎట్టి పరిస్థితుల్లోను శీతల పానీయాలను సేవించ కండని సలహా యిచ్చాడు. ఆల్ ఇంగ్లాండు బ్యాడ్‌మింటన్‌ఛాంపియన్ అయిన వెంటనే పుల్లెల గోపీచంద్‌కు శీతల పానీయాల ప్రకటనలకు కోట్ల రూపాయల ఆఫర్లు వచ్చినప్పటికీ సున్నితంగా ఆయన వాటిని తిరస్కరించాడు. ఆరోగ్యానికి అది మంచిది కాదని, తాను త్రాగనపుడు యితరులను త్రాగమనడం భావ్యం కాదని, అది అనైతికమని అతను భావించాడు. అలా తిరస్కరించడానికి ఎంతో నైతికబలం, చిత్తశుద్ధి వుండాలి.

తమతమ నైపుణ్యాలతో ఎంతో ప్రాచుర్యం పొంది. కోట్లాది ప్రజల అభిమానం పొందుతున్న తారలు డబ్బుకోసం తాము త్రాగని పానీయాలను తమ అభిమానులను త్రాగమనడం ఎంతో అనైతిక చర్యగా భావించాలి. తమడబ్బుకోసం తమను ఎంతగానో ఆరాధించే వాళ్ళను 'శీతల విషాలను' సేవించమనడం కంటే దగా, మోసం ఏముంటుంది. అంతేకాదు, ఒకేరకమైన ప్రకటనలైతే బోర్ కొడుతుందని రకరకాల స్కీములు, ప్రకటనలతో మభ్యపెట్టిస్తుంటారు. ఉదాహరణకు-థమ్స్ అప్ బాటిల్ మూతఅడుగున ఏదోఒకటి రాసివుంటుంది. అలాంటి మూతలు పది సేకరించి మాకు పంపిస్తే...అంటూ పది బాటిల్స్ కొంటే కాని అలాంటి ఒక మూత దొరకదు. మరి అన్ని సేకరించాలంటే ఎన్నో బాటిల్స్ కావాలి. ఇలా వాటి అమ్మకాలు పెరుగుతూపోతాయి. ఎంతోమంది చిన్నపిల్లలు, యువకులు, మధ్యతరగతి స్త్రీలు ఇలాంటి విషయాలపై ఎంతో సమయాన్ని వెచ్చిస్తూ వుంటారు.

ఈకంపెనీలకు వ్యతిరేకంగా వివిధపార్టీలు, ప్రజాసంఘాలు తమ తమరీతిలో నిరసనలుతెలుపుతున్నాయి.దేశంలోని అనేకప్రాంతాలలో కోకాకోలాకు వ్యతిరేకంగా (భూగర్భజలాల వెలికితీత విషయంలో) ఉద్యమాలు పుట్టుకొస్తున్నాయి. కానీ ఐక్య ఉద్యమాలు కావాలి.

బహుళజాతి సంస్థలు, ఇతర బడా కంపెనీలు తమ వ్యాపార ప్రయోజనాలకోసం ఉమ్మడిగా ముందుకు వస్తుంటాయి. కోకా, పెప్సీ కంపెనీలు ఒక్కసారిగా సి.యస్.ఇ.కి వ్యతిరేకంగా ఎలా ఒక్కటైనాయో చూడండి. కాని వాటికివ్యతిరేకంగా పోరాడవలసినశక్తులు ముఖ్యంగా వామపక్షాలు ఎలా ఉన్నాయో చూడండి. ఎవరికివారే యమునాతీరే. బహుళజాతి సంస్థలు ఏకమై, వారి అడుగులకు మడుగులొత్తే కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు తోడైనపుడు, ఎంత ఉధృతమైన ఉద్యమాలు, పోరాటాలు సాగించాలో చూచినపుడు, వామపక్షాలు, కాంగ్రెస్ ప్రతిఘటన ప్రధానంగా ప్రకటనలకేపరిమితంకావటందురదృష్ట కరం. ఈ ప్రభుత్వం బూర్జువా, బడాబూర్జువా, సెమీఫ్యూడల్ ప్రభుత్వమా అనే విషయం గురించి ఒక అభిప్రాయానికి వచ్చేవరకూ తాగునీరు గురించి కూడా కలిసి ఉద్యమం నిర్వహించలేరా ఏమిటి? బహుళజాతి సంస్థల దోపిడీకి అందరూ వ్యతిరేకమే కదా. అలాంటప్పుడు అందరూ చేయి, చేయి కలపటంలో అభ్యంతరం ఏమిటి? ప్రజలు హర్షించరన్న విషయాన్ని వారు గుర్తిస్తే మంచిది. అనుభవాల నుంచి నేర్చుకోకపోవడం, ఎవరికివారు తామే అసలు సిసలైన కమ్యూనిస్టులనుకోవడం, తాము పెరగటంలో కంటే ఎదుటివారు పెరగకపోవడంలలో ఆనందించడం వగైరా లాంటి మనస్థత్వాలతో వామపక్షాలు నడుస్తున్నప్పుడు ఎవరుమాత్రం ఏమిచేస్తారు. ○

# జనాభా పరివర్తన - ఒక విశ్లేషణ

— కె.ఎస్. జేమ్స్
(సెస్, హైదరాబాద్)
— ఎస్.వి. సుబ్రహ్మణ్యన్
ఆర్. వర్డ్ సెంటర్ ఫర్ సొసైటీ అండ్ హెల్త్, బాస్టన్ (అమెరికా)

**ఆంధ్రప్రదేశ్‌లో** జనాభా, జనసాంద్రత వేగంగా పరివర్తన చెందుతున్నాయి. ఈ మార్పును ప్రేరేపిస్తున్న కారణాలు చర్చనీయాంశమే అయినా, మార్పు మాత్రం నిజం. 1980 దశకం పూర్వార్థంలో జననాల సంఖ్య గణనీయంగా పడిపోవడంతో ఈ మార్పు వేగాన్ని సైతం పుంజుకుంది. ఈ విధంగా జననాల సంఖ్య తగ్గడం వలన సామాజిక, ఆర్థిక వ్యత్యాసాల విషయంలో చెప్పుకోదగ్గ ప్రగతిలేకున్నా, జనాభానియంత్రణ, జనసాంద్రత సూచికలు మాత్రం జరిగిన మార్పుకు అద్దం పడుతున్నాయి.

జనాభాపై చర్చ మరీ ముఖ్యంగా మనదేశంలో జననాల సంఖ్య శీఘ్ర పరివర్తన చుట్టూనే పరిభ్రమిస్తోంది. అయితే, జనాభా మార్పు, జనసాంద్రత పరివర్తనలను జననాల సంఖ్య ప్రభావం కేవలం ఒక కారణం మాత్రమే. మరణాల శాతం, వలసలు అన్నవి మరి రెండు కీలక చర్చనీయాంశాలు.

అదే సమయంలో జనాభా-ఆర్థిక అభివృద్ధి మధ్య సంబంధం, ఆర్థిక అభివృద్ధికి జనాభా నియంత్రణ ఆవశ్యకత కూడా కీలక చర్చనీయాంశాలవుతాయి. ఈ నేపథ్యంలో గత 25 సంవత్సరాల కాలంలో మనరాష్ట్రంలో జనాభా విషయంలో చోటుచేసుకున్న మార్పులు, దానితో ముడిపడివున్న సామాజిక, ఆర్థిక పరిణామాలు చర్చించవలసి వుంది. ఆ ప్రయత్నమే ఈ వ్యాసం.

## జనాభా పెరుగుదల

గత శతాబ్ద ఆరంభం నుండి దశాబ్దాలవారీగా జనాభా పెరుగుదల శాతాన్ని గమనిస్తే, రాష్ట్రంలో 1961 వరకు 15 శాతం కంటే తక్కువగా వుంది. తదనంతరం గణనీయంగా' పెరిగింది. 1981-91 దశాబ్దకాలంలో గత శతాబ్దంలోనే అత్యధిక (24.2 శాతం) జనాభా పెరుగుదలరేటు నమోదైంది. ఇది దేశంలోని అన్ని రాష్ట్రాలలోకన్నా అత్యధిక వృద్ధిరేటు. అయితే 2001 జనాభా లెక్కల ప్రకారం దేశంలో 1.93 వార్షిక వృద్ధిరేటుంటే, రాష్ట్రంలో మాత్రం అది కేవలం 1.3 శాతంగా నమోదైంది. అంటే 1981-91 దశాబ్దంలో 2.17 శాతం నమోదైన జనాభా వృద్ధిరేటు తదనంతర దశాబ్దం (1991-2001) నాటికి 1.30 శాతానికి పడిపోయింది. అంటే ఈ ఒక్క దశాబ్దకాలంలో రాష్ట్రంనందు జనాభా వృద్ధిరేటు 40 శాతం పడిపోయింది.

మనం ఇంతకుముందే చెప్పుకున్నట్లుగా జనన, మరణాలు, వలసలు ప్రధానంగా జనాభా పెరుగుదలపై ప్రభావాన్ని చూపుతాయి. ప్రస్తుత జనాభాపెరుగుదలశాతం ప్రధానంగా జనసాంద్రత మార్పుల వలన ప్రభావితమైంది. అయితే, మరణాల సంఖ్య తక్కువగా ఉన్నప్పటికీ జనాభా పెరుగుదల శాతం తక్కువగా ఉండడానికి జననాల శాతంలో చోటుచేసుకున్న మార్పులూ కారణమవుతాయి. అంతర్‌రాష్ట్ర వలసల ప్రభావమూ ఉంటుంది. ఈ మూడు అంశాలను ప్రత్యేకంగా చూస్తే రాష్ట్రంలో జనాభా పరివర్తన ఫలితంగా ఉందన్న విషయం తేటతెల్లం కాగలదు.

## పునరుత్పత్తి ప్రభావం

ప్రామాణికల విషయంలో కొన్ని అనుమానాలున్నప్పటికీ, 1960 దశకం పూర్వార్థంలో ప్రారంభమైన 'శాంపిల్ రిజిస్ట్రేషన్ డేటా' (ఎస్.ఆర్.ఎస్.) ద్వారా దేశంలో జనాభాకు సంబంధించిన కొంత ఖచ్చితమైన సమాచారం ప్రకారం 1970ల నుండి రాష్ట్రంలో జనన, మరణాలు రెండూ తగ్గుతూనే ఉన్నాయి. అయితే 1970, 1980 దశాబ్దాల ప్రథమార్థంలో జననాల తరుగుదల శాతం మెల్లగా సాగింది. అదే మరణాల విషయానికొస్తే 1970 దశకంలో చాలా వేగంగా పడిపోయింది. ఈ కారణంగా 1980 ప్రథమార్థం నాటికి సహజ జనాభా వృద్ధిరేటు అత్యధిక స్థాయికి చేరుకుంది. అయితే, 1980 పూర్వార్థం నుండి ఓవంక మరణాలశాతం తగ్గుతూవస్తున్నా, జననాల శాతంలో తరుగుదల దీనిని అధిగమించింది. ఫలితంగా సహజ జనాభా వృద్ధిరేటు గణనీయంగా పడిపోయింది.

జననాల శాతం తరుగుదల పరిమాణాన్ని మరింత మెరుగ్గా అంచనావేసేందుకు టి.ఆర్.ఎఫ్. (టోటల్ ఫెర్టిలిటీ రేట్) మరింతగా ఉపకరిస్తుంది. టి.ఆర్.ఎఫ్. ప్రకారం 1970 ప్రారంభంలో 4.6గా ఉన్న మహిళల నగటు పునరుత్పాదక సామర్థ్యం 1997 నాటి, అంటే 26 సంవత్సరాల కాలంలో రెండుకు పడిపోయింది. ఇక్కడ మరో ఆసక్తికరవిషయం ఏమంటే, పునరుత్పాదక సామర్థ్యం రెండుకు చేరడానికి మొత్తంగా 26 సంవత్సరాలు పడితే అందులో సగం 1987-97దశకంలోనే జరిగింది. దాన్నిబట్టి 1980 మధ్యకాలంలో పునరుత్పాదక సామర్థ్యం ఎంత వేగంగా పరివర్తన చెందిందో అర్థం చేసుకోవచ్చును. అయితే, నేషనల్ ఫ్యామిలీ హెల్త్ సర్వే అంచనాలు ఎస్.ఆర్.ఎస్. అంచనాల కంటే, తక్కువగా ఉన్నాయి. నేషనల్ సర్వే ప్రకారం 1996-98 మధ్యకాలంలో పునరుత్పాదక సామర్థ్యం (టి.ఎఫ్.ఆర్.) 2.25 శాతం నమోదైంది. ఇందులో పట్టణ ప్రాంతాల (2.07) కంటే గ్రామీణ ప్రాంతాల్లో సామర్థ్యం (2.32) స్వల్పంగా ఎక్కువగా వుంది.

ఇందుకు ప్రధాన కారణం గర్భనిరోధక పద్ధతులను పాటించడం. రాష్ట్రంలో 60 శాతం మంది వివాహిత మహిళలు ఈ పద్ధతులను,

మరీ ముఖ్యంగా స్టెరిలైజేషన్ విధానాన్ని పాటిస్తున్నారు. 1990లలో గర్భనిరోధక విధానాల వినియోగం మరింతగా పెరిగింది. 1992-93 సంవత్సరంలో 43 శాతం నుండి 1998-99 నాటికి 60 శాతానికి పెరిగింది. ఎన్.ఎఫ్.హెచ్.ఎస్. రెండవ సర్వే ప్రకారం దేశంలోని అన్ని రాష్ట్రాల కంటే మన రాష్ట్రంలో స్టెరిలైజేషన్ సగటు వయసు (23.6 సం॥) చాలా తక్కువగా వుంది.

ఇక్కడ మరో విశేషం ఏమంటే, ఇది ఏదోఒక వర్గానికి మాత్రమే పరిమితం కాలేదు. ఫలితంగా వివిధ వర్గాల మధ్య వ్యత్యాసం అత్యల్పస్థాయికి చేరుకుంది. ఎన్.ఎఫ్.హెచ్.ఎస్. ఒకటి, రెండు సర్వేలను పరిశీలిస్తే (టేబుల్ చూడండి) హైస్కూల్ ఆ పై విద్యార్హతలు గలవారిలో, క్రైస్తవులలో మినహా మిగిలిన ఆర్థిక, సామాజిక వర్గాలన్నింటిలోనూ జననాల సంఖ్య తిరోముఖ పయనం సాగిస్తున్న దాఖలాలు దర్శనమిస్తాయి. అయితే ఈవర్గాలలో ఎన్.ఎఫ్.హెచ్.ఎస్. తొలి సర్వేనాటికే జననాల శాతం చాలా తక్కువగా, రీప్లేస్‌మెంట్ స్థాయికంటే తక్కువగా వుంది. మరో ఆసక్తికర విషయం ఏమంటే, గడిచిన ఏడుసంవత్సరాలకాలంలో నిరక్షరాస్యత గిరిజన మహిళలలో కూడా, జననాలు గణనీయంగా తగ్గుతూ వస్తున్నాయి. షెడ్యూలు తెగలలో అయితే ఒక మహిళకు ఒక శిశువు స్థాయికి జననాల శాతం చేరుకుంది. మహిళల్లో 64 శాతం, షెడ్యూలు కులాలు, తెగలలో సుమారు 25 శాతం మంది నిరక్షరాస్యులున్న రాష్ట్రంలో ఈ పరిణామం అత్యంత ప్రాధాన్యతను సంతరించుకుంటుంది. ఈ గణాంక వివరాలను గమనిస్తే, ఈ సామాజిక, ఆర్థిక వర్గాలలో వచ్చిన మార్పే రాష్ట్ర జనాభా పెరుగుదల గణనీయంగా క్షీణించడానికి ప్రధాన కారణమని వేరే చెప్పనక్కరలేదు.

ఇక ప్రాంతాలు, జిల్లాలవారీగా చూస్తే, 1994-2001 మధ్య కాలంలో మహబూబ్‌నగర్ జిల్లాలో జనాభా వృద్ధిరేటు 3.1 శాతం వుంటే, కృష్ణా, గూంటూరు, హైదరాబాద్ జిల్లాలలో 1.9గా వుంది. కోస్తా, రాయలసీమ ప్రాంతాలలో జననాల స్థాయి తక్కువగా ఉన్నప్పటికీ, 1981, 1994-2001 మధ్యకాలంలో అన్నిప్రాంతాల లోనూ జననాల సంఖ్య తరుగుదల తెలంగాణాతో సహా అన్ని ప్రాంతాలలోనూ కనిపిస్తోంది. ముఖ్యంగా విజయనగరం జిల్లాలో అన్ని జిల్లాలకంటే జననాల తరుగుదల తక్కువగా వుంది.

శిశు జననాలు ఎందుకు తగ్గుతాయి. అంటే అందుకు వివిధ 'థియరీలు' ప్రచారంలో ఉన్నాయి. అయితే అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఈ దిశగా సంభవిస్తున్న పరిణామాలు మాత్రం ఏ థియరీ సర్వేలోకి రావడంలేదు. ప్రధానంగా ఉన్న థియరీలలోనూ వినవచ్చే ఆర్థిక అంశాల ప్రభావం అభివృద్ధి చెందుతున్న దేశాల విషయంలో పొసగడం లేదు. అలాగే సామాజిక అభివృద్ధికి జనాభా పరివర్తనకు మధ్యకూడా అంతగా పొంతన గోచరించడం లేదు. మహిళా జనాభా నియంత్రణను కీలకమన్న వాదనగానీ, మహిళ ఆరోగ్యం తద్వారా సాధ్యమయ్యే శిశిమరణాల నిరోధం జనాభా నియంత్రణకు అవసరమన్న సామాజికవాదం అభివృద్ధి చెందుతున్న దేశాల విషయంలో పొసగడంలేదు. అదేవిధంగా నిధుల కొరతకు ప్రత్యామ్నాయంగా ఇటీవలకాలంలో తెరపైకి వచ్చిన విస్తరణవాదం (డిఫ్యూజన్ థియరీ) కూడా పూర్తిగా నిలవలేకపోయింది.

ఇదే పరిస్థితి ఆంధ్రప్రదేశ్‌లోనూ దర్శనమిస్తోంది. రాష్ట్రంలో సామాజిక, ఆర్థిక ప్రగతి అత్యంత దయనీయంగా వుంది. రాష్ట్రంలో తలసరి ఆదాయం జాతీయ తలసరి ఆదాయం కంటే తక్కువ. మహిళల అక్షరాస్యత అన్ని రాష్ట్రాలకంటే తక్కువ. శిశుమరణాల సంఖ్య చాలా ఎక్కువ. రాష్ట్ర ఆర్థిక దృష్టి, దృక్పథం వ్యవసాయరంగం నుండి మరలడం వలన ఆర్థికవ్యవస్థలో ఎలాంటి గణనీయమార్పు చోటుచేసుకోలేదు. జనాభా విషయంలో గ్రామీణ- పట్టణ ప్రాంతాల నడుమ చెప్పుకోదగ్గ మార్పులు చోటుచేసుకోలేదు.

ఈ విధంగా ఆంధ్రప్రదేశ్‌లో జననాల సంఖ్య క్షీణించడానికి, ఆధునీకరణ, అభివృద్ధి వాదనలు పనిచేయలేదన్న విషయం చాలా స్పష్టంగా తేలిపోయింది. జిల్లాలవారీగా జననాల సంఖ్యను పోల్చిచూసినపుడు ఈ వాస్తవం మరింత స్పష్టమవుతుంది. మహిళలలో అక్షరాస్యత శాతం అత్యల్పంగానూ, శిశుమరణాల సంఖ్య అత్యధికంగా (వరుసగా వెయ్యి జననాలకు 77, 99)గా ఉన్న ఈ జిల్లాలలో జననాల సంఖ్య గణనీయంగా తక్కువగా వుంది. అదేవిధంగా జిల్లాల స్థాయిలో (1991 జనాభా లెక్కల ప్రకారం) నిర్వహించిన తిరోగమన సమీక్షలో కూడా, సామాజిక, ఆర్థిక పరిణామాల ప్రభావం జనాభా నియంత్రణపై లేదనే తేల్చిచెపు తున్నాయి.

ఈ విధంగా సామాజిక, ఆర్థిక సూత్రీకరణలు, జనాభా తిరోగమనానికి సరైన ఆధారాలను చూపలేని నేపథ్యంలో, ఇందుకు రెండు విశ్లేషణలు వినవస్తాయి. అందులో మొదటిది ఊహాజనిత విస్తరణ గురించి, రెండవది స్థానిక, వ్యక్తిగత పరిస్థితుల ప్రభావం.

అంటే, వ్యక్తినుండి వ్యక్తికి ప్రచారం జరగడం...ఒక వ్యక్తి ప్రభావం అనేకమందిపైకి వ్యాపించడం, అది ఒక సామాజిక ప్రభావంగా మారడం వలన జనాభా పెరుగుదల శాతం రాష్ట్రాలలో తిరోముఖ పయనం సాగి గానీ, సామాజిక, ఆర్థిక స్థితుల ప్రభావం గానీ, ఇతర సిద్ధాంతాల జోక్యం గానీ ఇందులో లేదన్నది సుస్పష్టం.

అయితే ఈ విస్తరణవాదం చోటుచేసుకున్న మార్పుకు ఒక కారణాన్ని, ఆధారాన్ని చూపడానికి పనికొస్తుందే గానీ, అదే విధమైన ప్రభావాన్ని అన్ని ప్రాంతాలలోనూ ఎందుకు చూపలేకపోతుంది... ఒకప్రాంతంలో ఒకవిధంగా మరోప్రాంతంలో అందుకు వ్యతిరేకంగా ఎందుకు పనిచేస్తోంది వంటి ప్రశ్నలకు సమాధానాలను ఇవ్వలేదు. అయితే, కొన్ని దేశాలలో, కొన్ని రాష్ట్రాలలో ఈ విస్తరణవాదమే జనాభా నియంత్రణకు ప్రధాన ఆధారంగా ఉన్నప్పటికీ అందులో కొన్ని ప్రత్యేక కార్యక్రమాలు కారణంగా కనిపిస్తున్నాయి. బంగ్లాదేశ్‌లో గ్రూప్ బెస్ట్ లెడింగ్ ఫోరం, కేరళలో రాజకీయ, ఆర్థిక విధానాల, అభివృద్ధి ప్రణాళికలలో సామాజిక న్యాయానికి సముచిత ప్రాధాన్యతను ఇవ్వడం, భూసంస్కరణలు, వ్యవసాయ కార్మికుల వేతనాలు పెంచడం వంటి చర్యలు ప్రభావాన్ని చూపాయి. తమిళనాడు విషయంలో అయితే, రాజకీయ నాయకత్వం దీక్ష, సంఘ సంస్కర్తల ప్రభావం ప్రధాన కారణాలుగా కనిపిస్తాయి.

మరి మన మాటేమిటి? మన రాష్ట్రంలో జనాభా పరివర్తనకు 'ప్రత్యేక' కారణాలు ఏమిటీ అని ఆలోచిస్తే, 1980 పూర్వార్థం, 1990లలో జనాభా నియంత్రణ వేగాన్ని పుంజుకుంది. మరీ ముఖ్యంగా 1990లో ఈ వేగం మరీ జోరుగా పరుగులు తీసింది. (1990లలో కుటుంబ నియంత్రణ ఆపరేషన్ల ధోరణిని గ్రాఫ్ చూడవచ్చును. జనాభా నియంత్రణ పరుగులు తీస్తూనేవుంది. కాబట్టి, ఈ కాలంలో వచ్చిన విధానపరమైన మార్పులను క్లుప్తంగా విశ్లేషించవలసిన అవసరం ఉంది.

1980, 1990 దశకాలలో అనుసరించి, అమలుచేసిన విధానాలు ప్రజల ఆర్థిక జీవనంపై ప్రభావాన్ని చూపడమే కాకుండా, సామాజిక మార్పులకు బాటలు వేశాయన్న వాదన వుంది. ఈ సందర్భంగా ఈ వాదనను సమర్థించేవారు, పటిష్ట ప్రజాపంపిణీ వ్యవస్థను తీవ్రంగా అమలుచేయడం, ఐసిడిఎస్ వంటి పేదరిక నిర్మూలన కార్యక్రమాలను సమర్థవంతంగా అమలుచేయడాన్ని ప్రత్యేకంగా పేర్కొంటున్నారు. రాష్ట్ర ప్రభుత్వం ద్విముఖ వ్యూహాన్ని అమలుచేసిందని, ప్రజల భాగస్వామ్యంతో పేదరిక నిర్మూలన కార్యక్రమాలను చేపట్టి, వాటికి, చిన్న కుటుంబాల నిబంధనలు జతపరిచిందని రామచంద్రుడు, కమలమ్మ (2002) విశ్లేషిస్తున్నారు. అలాగే అనేక ఇతర ప్రభుత్వ శాఖలలో ఉత్తమ పరిపాలన పద్ధతులను పాటించడం, స్వయంసహాయక బృందాలు, డ్వాక్రా గ్రూపులకు ప్రోత్సాహాన్ని అందించడం ద్వారా గ్రూప్ పెండింగ్ (రుణ సదుపాయం)ను సమర్థవంతంగా అమలుచేసినట్లు ఓ.ఆర్.జి.-మార్గ్ సర్వే 2000 పేర్కొంది. సుపరిపాలన విధానాల ప్రభావం విస్తరించి కుటుంబ నియంత్రణ వేగాన్ని పుంజుకున్నదని వారి వాదన.

రాష్ట్రంలో కుటుంబ నియంత్రణ కార్యక్రమాన్ని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, ఉపకేంద్రాల ద్వారా అమలుచేస్తున్నారు. ఈ ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల సంఖ్య, 1980లలో గణనీయంగా పెరిగింది. 1980లలో మండల వ్యవస్థను ప్రవేశపెట్టడం వలన ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల సంఖ్య ఒక్కసారిగి 450 నుండి 1100కు పెరిగింది. అదేవిధంగా డాక్టర్ల నియామకాలు జరిగాయి. ఆవిధంగా కుటుంబ నియంత్రణ సదుపాయాలు అందరికీ అందుబాటులోకి వచ్చాయి. దీనికితోడు స్వయం సహాయక సంఘాలు, ఉపాధికల్పనా కార్యక్రమాలు, అక్షరాస్యత కార్యక్రమాలు, మరింత తోడ్పాటునందించాయి.

1990లలో కుటుంబ నియంత్రణ కార్యక్రమానికి మరింత స్పష్టమైన రూపం, మరింత ప్రోత్సాహంతో దేశంలోనే మొదటిసారిగా 1997లో రాష్ట్ర ప్రభుత్వం జనాభా విధానాన్ని ప్రకటించింది. నిర్దిష్ట లక్ష్యాలను లక్ష్యసాధనకు అనుసరించవల్సిన విధివిధానాలను ఇందులో పొందుపరిచారు.

కాబట్టి రాష్ట్రంలో జనాభా నియంత్రణ సమస్య పరిష్కారానికి ప్రభుత్వం అనుసరించిన కుటుంబ నియంత్రణ, సంక్షేమ కార్యక్రమాలు కొంతవరకు కారణంగా కనిపిస్తున్నాయి. జనాభా నియంత్రణ సమర్థవంతంగా సాగిన దేశాలు, ఇతర రాష్ట్రాల అనుభవాలను గమనించినా, సుపరిపాలన ప్రాధాన్యతను స్పష్టం చేస్తున్నాయి. అంటే, ఆర్థిక అభివృద్ధి జరిగితేనే, సామాజికమార్పు సాధ్యమన్న వాదన నరికాదు. లక్ష్యసాధనకు మరెన్నో మార్గాలుంటాయన్నది ఈ అనుభవం అందిస్తున్న సందేశం.

అలాగే ఈ విజయపరంపర ఇలాగే కొనసాగితే, మరికొద్ది కాలంలోనే, జనాభా నియంత్రణ విషయంలో రీప్లేస్‌మెంట్ స్థాయికి చేరుకుంటుందనడంలో సందేహం లేదు. కానీ, ఏ సూత్రీకరణకు చిక్కని ఈ పరిణామ క్రమంపై మరింత అధ్యయనం మరెన్నో కోణాలలో జరగవలసివుంది. అందుబాటులో ఉన్న సమాచారం ఆధారంగా చూస్తే, రాష్ట్రంలో జనాభా నియంత్రణకు ఊహాజనిత కారణాలు ఆధారమవుతున్నాయి. నిర్దిష్ట కారణాలు, సూత్రీకరణలు ఆధారం కావడంలేదు. సమర్థపాలన గర్భస్థ నిరోధక సాధనాల వినియోగం వరకు చక్కగా పనిచేస్తోంది. కానీ, గ్రామీణ స్థాయిలో సంక్షేమ పథకాల అమలు అసంబద్ధ వ్యత్యాసాల కారణంగా పూర్తి ఫలితాలను ఇవ్వలేకపోతున్న వాస్తవాన్ని రెండవ నేషనల్ ఫ్యామిలీ హెల్త్ సర్వే విశ్లేషణ స్పష్టం చేస్తోంది.

రాష్ట్రంలో మరణాల శాతంలో మార్పులు జననాల శాతంలో మార్పులకంటే ముందుగానే చోటుచేసుకున్నాయి. మొత్తంగా చూస్తే రాష్ట్రంలో మరణాల సంఖ్య, శాతం తగ్గాయి. కానీ, అదేసమయంలో శిశుమరణాల సంఖ్య చాలా ఎక్కువగా వుంది. అందులోనూ గర్భస్థ మరణాల సంఖ్య మరింత అధికంగా వుంది. ఇందుకు ప్రధాన కారణం తల్లుల ఆరోగ్య పరిస్థితి. రాష్ట్రంలో మహిళల సామాజిక, ఆరోగ్య సూచికలను గనుక గమనిస్తే, మహిళల సమగ్ర ఆర్థిక, ఆరోగ్య, సామాజిక స్థితిగతులను మెరుగుపరచకుండా శిశు మరణాలను తగ్గించడం సాధ్యంకాదు. ముఖ్యంగా తల్లుల పోషక విలువల సమస్యను పట్టించుకోలేని ఈ సమస్యకు పరిష్కారం లభించదు.

ఇక్కడ చర్చించిన అంశాలతోపాటుగా ఇందుకు సంబంధించిన వలసలు తదితర కీలకఅంశాలను కూడా పరిగణనలోనికి తీసుకుంటే, రాష్ట్రంలో చోటుచేసుకున్న ఈ జనాభా పరివర్తన ప్రభావం ముందు ముందు అనేక రూపాలలో సమస్యలను సృష్టించే అవకాశం వుంది. ప్రధానంగా ఉపాధిఅవసరమున్న వయస్కుల జనాభా పెరుగుతుంది. ఈ ప్రభావ ఫలితంగా ఉపాధిపై తీవ్ర వత్తిడి ఏర్పడుతుంది. అదేవిధంగా 1991-2016 మధ్యకాలంలో వృద్ధుల జనాభా కూడా రెట్టింపుకంటే ఎక్కువ అవుతుంది. అదే సమయంలో పిల్లలసంఖ్య తగ్గుతుంది. ఈసమస్యనుఎదుర్కొనేందుకు అవసరమైన సామాజిక భద్రతాచర్యలు సిద్ధమవుతాయన్నది చాలా పెద్దప్రశ్న. ఈప్రశ్నకు సమాధానం ప్రభుత్వవిధానాలలో వుందా? ○

సంక్షిప్త స్వేచ్ఛా అనువాదం: ఆర్. బాలకృష్ణ, హైదరాబాద్.

# పసితనంపై మత ప్రభావం

— ఎన్. ఇన్నయ్య

**పిల్లలు** మనసొంతం. మనం కావాలనుకునేలా చేయగలం వారిని. మరొకరి ప్రమేయాన్ని సహించలేం. ఔను! అందుకనే ఈ భూప్రపంచంలో లక్షలాది తల్లిదండ్రులు యిదేకోవలో ఆలోచిస్తారు. అందుకనే ఏమో "మొక్కైవంగనిది మానై వంగునా?" వంటి సామెతల పసివారి పట్ల తీవ్రశిక్షలను సమర్థించే ప్రయత్నం చేస్తుంటారు. అనేక సంప్రదాయ మతాలు పిల్లల్ని కేవలం ఆస్తులుగానే పరిగణించే తత్వాన్ని ప్రోత్సహిస్తాయి. తద్వారా ఎక్కువ సంతానం కలిగివుండటమే వాళ్లనలా చేస్తాయి. "పిల్లవాడు ఒక్కనోటితోనే పుట్టడుకదా! సంపాదించే రెండు చేతులతోనూ జన్మిస్తాడు" వంటి వాదనలు ఇక్కడినుంచే వస్తాయి. నేడు విలక్షణంగా కన్పిస్తున్న పసితనపు దుర్వినియోగానికి సామాజిక సంస్థలు నిందార్హమైనవే అయినా మతాలే ఇందుకు మూలం. యావత్ ప్రపంచవ్యాప్తంగా, పసిప్రాయ దుర్వినియోగాన్ని ప్రోత్సహించేది మతమే.

తరతరాలుగా తల్లిదండ్రులకు పిల్లలకు మధ్యనున్న బాంధవ్యాల శక్తిని మతాలు దుర్వినియోగం చేయడం కద్దు. జీవిత ప్రతి పార్శ్వాన్ని మతప్రచార కూటమి తడుముతూ భక్తివిశ్వాసాల లోతుల్లోకి కుటుంబాలను నెట్టేస్తుంటాయి. అత్యధిక సంస్కృతుల్లో పిల్లల పుట్టుక, తదనంతర నామకరణ మహోత్సవాలతో, ఈ కుట్రలో ఇరికించడం మొదలవుతుంది. తల్లిదండ్రులు మత సంప్రదాయ ఆచారాలరీత్యా అది తమ విధిగా భావిస్తారు. తద్వారా అస్థికత్వ జీవనానికి పునాది పడిందనుకుంటారు.

మతప్రచారకులు, పెద్దలు పిల్లల్ని తమతో గుళ్ళుగోపురాలకు తీసుకెళ్ళడాన్ని ప్రోత్సహిస్తారు. పెద్దలు ఈ గుళ్ళు గోపురాల అనుభవాలే పిల్లల్లో దేవునిపట్ల భక్తివిశ్వాసాలతోపాటు నైతిక ప్రవర్తనను అలవరుస్తాయనీ ఆశిస్తారు, విశ్వసిస్తారు. ఈ విధంగా పిల్లల హక్కులపై వారిపుట్టుకనుండి నియంత్రణ మొదలవుతుంది. యిది అన్నిదశల్లోనూ అన్ని మతాల్లోనూ వుంది. తల్లిదండ్రులు తమ పిల్లలకు ఇతర మతాలపట్ల, వారివారి ఆచార వ్యవహారాల పట్ల వ్యతిరేకతను ప్రబోధిస్తుంటారు (హెచ్చరిస్తుంటారు). ఈ విధంగా విద్వేష విత్తులను ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రభావిత మనసుల్లో నాటడం జరుగుతుంది.

పిల్లలు జన్మించడంతోనే తల్లిదండ్రుల మతప్రభావం వారిని ఆవహిస్తుంది. మాట్లాడటం లేదా రాయడం నేర్చుకునే ప్రాయానికే వారు వారి మతాన్ని గుర్తించగలుగుతారు. ఎందుకంటే, అది వారికోసమే వేచివుంటుంది కనుక. ఈవిధంగా బాల్యంనుండే మతంలో కూరుకు పోవడంతో తదుపరి జీవన గమనంలో మతాన్ని అతిక్రమించడం గగనమవుతుంది. కడకు అనేకమంది వృత్తిరీత్యా సాంకేతిక నిపుణులైనా, శాస్త్రవేత్తలైనా మతప్రభావాన్ని దాటిరాలేరు. విద్య వారి భవిష్యత్తును తీర్చిదిద్దగలుగుతుందే తప్ప, వారి ఆచరణ ఎప్పటికీ మతాన్ని అంటిపెట్టుకునే వుంటుంది. ఏదైనా ఓ విషయాన్ని నమ్మాలంటే పరిశీలన, విశ్లేషణ, రుజువులను శాస్త్రం కోరుతుంది. రుజువుకాని అంశాలను గుడ్డిగా నమ్మకుండా ఉంటుంది.

కానీ విశ్వవ్యాపితంగా చదువుకున్న మేధావులుసైతం మతాన్ని శాస్త్రీయ పరిశీలన నుండి మినహాయిస్తారు. మత పునాదులు మానవాభ్యుదయానికి ప్రతిబంధకంగానే కనిపిస్తాయి. మత సంబంధిత విషయాలకు వారు నేర్చుకున్న శాస్త్రీయతను అన్వయించ పూనుకోరు. వారి నమ్మకాల పట్ల విస్వాసానికి, లేదా ఆచారాల్లో దిగి మునుగుతున్నందుకు గాను వారు మౌనంగా వుంటూ, పిల్లల పట్ల మతమౌఢ్య ప్రభావానికి ప్రేక్షకపాత్ర వహిస్తుంటారు. ఇందుకు ఉదాహరణలు కొన్ని క్రైస్తవ సంస్థలు పిల్లల ఆరోగ్య సంరక్షణ విషయంలో చూపుతున్న నిరాశక్తత రామన్ కాథలిక్‌లు పిల్లల విషయంలో ఆపాదిస్తున్న లైంగిక నిందల్లోనూ ఇస్లాం మతవాదులు లింగవివక్షత పేరుతో స్త్రీల జీవనాన్ని ఛిన్నా భిన్నం చేయడంలోనూ కన్పిస్తుంది. కఠినాతి కఠినమైన శిక్షలను ఆఫ్రికన్ మత షరియా చట్టప్రకారం విధించడం, నిమ్నవర్ణ పిల్లలను వెలివేయడం, బాల్య వివాహాలు, దేవదాసీల పేరిట వ్యభిచారం హిందూమతంలో ఓ భాగమైతే, నాగరిక సర్వసభ్య సమాజం మౌనమే వహిస్తుంది. మతాధిపతులను ధిక్కరించేందుకు భయపడుతుంది. వ్యక్తులుగా పసివారిపట్ల మతప్రమేయ నిందలను విమర్శించేవారిని, నాస్తికులుగా సమాజం నుండి వెలివేస్తుంది.

ఈ చీకటి తెరలమధ్య కాంతిరేఖలుగా చిన్నారులకు కొన్ని హుక్కుల్ని ప్రతిపాదించడం జరిగింది.

**బాలల హక్కులు**

బాలల హక్కులనే ప్రత్యేకాంశం మీద ఐక్యరాజ్యసమితి నవంబరు 20, 1989లో ఓ సదస్సును నిర్వహించింది. ప్రపంచ వ్యాప్తంగా బాలలకు కొన్ని ప్రాథమిక హక్కులను ఆపాదించింది. 191 దేశాలు ఈ ప్రతిపాదిత హక్కులను ఆమోదించాయి. చాలా దేశాలు బాలలహక్కుల ప్రణాళికలను రూపొందిస్తూ, ఐక్యరాజ్యసమితి ప్రతిపాదితాలకు మద్దతుగా స్థానిక చట్టాల్లో అవకాశాలనూ కల్పించడం జరిగింది. అయినప్పటికీ ఈనాటికీ బాలల హక్కుల

సదస్సు సూచనలు ప్రతిదేశంలోనూ ఆమోదాన్నిపొందలేకపోయాయి. సుస్థిర ప్రభాత్వానికి నోచుకోని సోమాలియా లగాయతు, అగ్రరాజ్య అమెరికావరకూ ఇదేస్థాయిలో వున్నాయి.

పద్దెనిమిది సంవత్సరాల లోపు పిల్లలకు ఈ బాలల సదస్సు ప్రతిపాదనలు వర్తిస్తాయి. తల్లిదండ్రులు, కుటుంబాలతోసహా దేశాలు వీటిని గౌరవించాల్సివుంది. బాలలహక్కుల పరిరక్షణదిశగా,కులవర్ణ వివక్షలను నిషేధించాలి. సదస్సు తీర్మానాలమేరకుప్రతిబాలుడు లేదా బాలిక విశ్వవ్యాప్తంగా సమాచారాన్ని పొందేందుకు, ఆలోచించేందుకు ఇతరులతో కలిసేందుకు వెసులుబాటు కల్పించ బడింది. బాలల అభివృద్ధి తల్లిదండ్రుల ప్రాథమికబాధ్యతైతే, ఇందుకు అవసర సహాయాన్ని ఆయా ప్రభుత్వాలు అందించాల్సివుంది. పిల్లల్ని తల్లిదండ్రులు వారి వ్యక్తిగతఆస్తులుగా పరిగణించక, 'నిందితులు'గా చేయరాదు.

స్పష్టంగా బాలల సదస్సు విషయాలను రూపొందించినప్పటికీ, ప్రపంచంలో చాలా దేశాల్లో ఇందుకు భిన్నంగా వున్నాయి. ఐక్యరాజ్య సమితి సభ్యదేశాలు సైతం సదస్సు ప్రదిపాదనల ధిక్కారాన్ని గుర్తిస్తున్నాయి. యూనిసెఫ్ లాంటి అనుబంధ సంస్థలు బాలలను నిందితులుగాచేయరాదని ఓ ఆందోళనా కార్యక్రమాన్ని చేపట్టినప్పటికీ దీనిప్రభావం పరిమితమైంది. కారణం మతాన్ని తడమకుండా, (నిందించకుండా) ప్రయత్నించడమే. మత ప్రభావం తీవ్రమైంది. ఉదాహరణకు వాటికన్ సిటీలో యూనిసెఫ్ ఆధ్వర్యంలో ఇటీవల జరిగిన సదస్సులో మతపెద్దలు విషయాలపట్ల మొసలికన్నీళ్ళకే పరిమితమయ్యారు తప్ప నిర్దిష్టచర్యల్ని చేపట్టలేకపోయారు. మత పునాదులపైనున్న బాలల నిందించే అంశం. 'సాంస్కృతిక సంక్షోభం' వంటి పదాలమాటున మరుగుపర్చబడింది.

ఐక్యరాజ్య సంస్థలు బాలలను వెట్టి కార్మికులుగా, యుద్ధ సమిధలుగా, శృంగార బాధితులుగాను వినియోగింపబడటాన్ని గుర్తించాయి. కొన్ని ప్రాంతాల్లో ఈ దురాగతాల బారినుండి పసివాళ్ళను రక్షించే ప్రయత్నాలు చేశారు. కానీ ఈ దురాగతాల మూలపునాదుల్లో మతప్రమేయాన్ని గుర్తించలేకపోయారు. మూలాన్ని గుర్తించనిదే దురాగతాలనరికట్టడం సాధ్యం కాదుకదా మతాలు వాటంతటవే ఆత్మవిమర్శని తమనితాము తప్పుపట్టుకోవు కదా! యిదెలా వుంటుందంటే, ఇంటిరక్షణ కోసం ఇంటితాళాలను దొంగచేతికిచ్చిన చందంగా.

## 'పిల్లలు-మతం' - అవాస్తవ ప్రతిపాదనలు

మత ప్రభావాల నతిక్రమించినవారు సర్వకాలాల్లోనూ ప్రగతినీ, అభివృద్ధినీ సాధిస్తూనేవున్నారు. నూతన విషయ ఆవిష్కరణలోనూ, అధ్యయనం చేయడంలోనూ, పరిశోధించడంలోనూ మరియు ప్రకృతి పాటవాలకనుగుణంగా వర్తిస్తూ మతాతీతంగ వ్యవహరించారు. ఎక్కడైతే పసివాళ్ళను మత ప్రభావాలకు గురిచేస్తామో, ఇందుకు లోబడమని నిర్దేశిస్తామో అక్కడ వారి మేధోప్రగతికి అవరోధం కలుగుతుంది. పిల్లలు దైవాన్ని ఆరాధించకుంటే గుడ్డివాళ్లయి పోతారనీ, అస్వస్థులవుతారని హెచ్చరించడం నేరాతినేరం. మానవ మేధస్సు వయస్సుతో వికసిస్తుందే తప్ప బండబారదు. ఆలోచించే మనస్సే ప్రతి మతానికి ప్రతిబంధకం కనుక పై ధోరణులను ఏ మత ప్రవక్త అభ్యంతరపర్చదు.

మతాన్ని శాస్త్రీయ దృక్పథంతో పిల్లలకు బోధించాలి. వారి మతంతోపాటు యితర మతాల గురించీ అధ్యయనం చేయాలి. వారికి దేవుడు-దెయ్యం లాంటి విషయాలతోపాటు స్వర్గ-నరకం, ప్రపంచ ధర్మగ్రంథాలు కూడా మానవ నిర్మితాలే అని తెలియపర్చాలి. 'జీవితం' అత్యున్నతమైంది. దాన్ని గౌరవించాలనే విషయం వారికి అవగతం కావాలి. మానసిక పరిపక్వత వచ్చేంతవరకూ ఆగి, ఆపై వారికి నచ్చిన మతాన్ని వారు ఆచరించే స్వేచ్ఛ వారికుండాలి.

మత ఆచరణ వంశపారంపర్య అంశం కాదని తల్లిదండ్రులు గుర్తెరగాలి. పిల్లలమేధస్సు వికసించేంతవరకూ అశ్లీలత, వ్యభిచారం, రాజకీయం, పెళ్ళి వంటి అంశాలతోపాటు మతాన్నీ దూరంగా వుంచాలి. అంతేగాని పిల్లలను గుళ్ళూ-గోపురాలకు తీసుకెళ్ళడం, గుడ్డి ఆరాధనను నూరిపోయడం, దేవునిపేర భయభ్రాంతుల్ని చేయడం పెద్దలకు తగదు-ఆమోదయోగ్యం కాదు. పిల్లల స్వాభావిక హక్కులను పెద్దలు హర్షించాలి, గుర్తించాలి, ఆమోదించాలి.

191 దేశాలు ఈ పిల్లల సదస్సులో ప్రతిపాదించిన అంశాలను చట్టాలను ఆమోదించాయి. కానీ అభివృద్ధి చెందిన అమెరికా వంటి దేశంలోనే మత వ్యతిరేకత కారణంగా ఇంకా ఆమోదించాల్సివుంది. పిల్లలపై ఎక్కడ తమ ఆధిపత్యాన్ని కోల్పోతామో అన్న భయంమేరకు తల్లిదండ్రులు వెనకాముందు అవుతున్నారు. మత సంప్రదాయాల మాటున వీరు పెరిగి పెద్దవారవటమే ఇందుకు కారణం. కాని వారి మతఛాందస భావాలను, అలవాట్లను, మూఢాచారాలను పిల్లల నెత్తిన రుద్దడం తగదు. ఈ అనారోగ్య గతానికి సమాధిచేసేరోజు మొదలుకానుంది ఇక.

మానవవిలువలకు సర్వమతాలూ వ్యతిరేకమే అన్న గుర్తింపుపైనే అనివార్యంగా మానవ ప్రగతి ఆధారపడి వుందని గ్రహించాల్సివుంది. దేవుని కొరకే జీవిస్తున్నామనే భావన మానవ విలువలకు విరుద్ధమనేది నిశ్చితాంశం. పసివాళ్ళను మతప్రభావం నుంచి రక్షించగలిగినపుడే మానవత్వానికి చేరువ కాగలుగుతారు. ○

సంక్షిప్త స్వేచ్ఛానువాదం: విద్యాభూషణ్

"**మహిళలను** తీవ్రంగా అవమానపరిచేదిగా ఉన్న పులిరాజా ప్రకటనను తక్షణం రద్దుచేయాలి. పులిరాజాకు ఎయిడ్స్ వస్తుందా? ప్రకటనకు విడుదల చేసిన సమాధానం దిగజారిన విలువలకు చిహ్నంగా, హేయమైన లైంగిక విశృంఖలతను ప్రోత్సహించేదిగా ఉంది. ఎయిడ్స్ పెరగటానికి మహిళలే బాధ్యులైనట్లు చిత్రీకరించే ఈ ప్రకటన ద్వారా అసలు పరిస్థితికి కారణమైన ప్రభుత్వం తన బాధ్యతను వదిలేసి నిస్సిగ్గుగా కండోమ్‌ల ప్రచారానికి పూనుకోవడం సిగ్గుచేటు"

– ఎస్.పుణ్యవతి, టి.ప్రేమపావని
(అఖిలభారత ప్రజాతంత్ర మహిళా సంఘం)

"**జ్యుడిషియల్** సర్వీసు అనేది కేవలం ఉపాధికల్పించే ఉద్యోగం కాదు. ఎందుకంటే న్యాయాధికారులు దేశన్యాయసార్వభౌమాధికారం కింద తమ విధులు నిర్వర్తిస్తున్నారు. వారి నిజాయితీ, సమగ్రత అనేవి సందేహాలకు అతీతంగా ఉండాలి స్థూలంగా వారిపేరు ప్రతిష్టల్లో ఇవి ప్రతిఫలించాలి. సందేహాస్పద వ్యక్తిత్వంగల వారిని, పనికిరానివారిని న్యాయవ్యవస్థ భరించజాలదు"

– సుప్రీం కోర్టు

"**భార్యాభర్తల** వివాదాలు బహు సున్నితమైనవి. వాటిని చాలా జాగ్రత్తగా పరిష్కరించాలి. దేశంలో ప్రస్తుతం చాలావరకు కుటుంబ న్యాయస్థానాలను సాధారణ కోర్టు ప్రాంగణాల్లోనే ఏర్పాటుచేశారు. ఏనాడూ వివాదాల జోలికి వెళ్ళని వ్యక్తులు భార్యతోనో, భర్తతోనో కలహం కారణంగా ఈ కోర్టుల ప్రాంగణంలో అడుగుపెట్టాల్సివస్తే వెంటనే వారిలో ఒకరకమైన భయం, తమను ఈ పరిస్థితికి తీసుకువచ్చిన వారిమీద ఏహ్యాభావం కలుగుతాయి. అప్పుడు ఆ కుటుంబాన్ని విడిపోకుండా చూడటం న్యాయమూర్తులకు మరింత కష్టమవుతుంది. అందుకే కుటుంబ న్యాయస్థానాలు ఇతర సాధారణ కోర్టుల మధ్య ఉండకుండా చూడాలి."

– జస్టిస్ ఎస్. రాజేంద్రబాబు (సుప్రీం)

"**రాష్ట్రంలో** ఆత్మహత్యలను ఆశ్రయించిన రైతులకుటుంబాలకు మొత్తం మూడులక్షలరూపాయల వంతున నష్టపరిహారం చెల్లించాలి. ఇప్పటికీ కొనసాగుతున్న రైతు ఆత్మహత్యలను నిర్లక్ష్యంచేయడం మానవహక్కుల పరిరక్షణచట్టం 1993 ఆర్టికల్12(ఎ)ప్రకారంనేరం"

– మానవహక్కుల సంస్థ కార్యదర్శి కె.ఆర్.వేణుగోపాల్

"**ఆరోగ్య**, విద్య, పారిశుద్ధ్యం వంటి రంగాలను పేదలకు అందుబాటులో లేకుండా మానవ సంక్షేమం సాధ్యంకాదు. అవిద్య నుంచి, అనారోగ్యం నుంచి పేదలకు విముక్తి కల్పించని పక్షంలో అభివృద్ధి అనేది ఒక కలగానే మిగిలిపోతుంది"

– ప్రపంచబ్యాంకు మానవ వనరుల అభివృద్ధి విభాగం
ఆర్థికవేత్త శాంతా దేవరాజన్

"**మేము** మరుగుజ్జులైనందున మమ్మల్ని ఎవరూ పనిలో పెట్టుకోవడం లేదు. మమ్మల్ని వికలాంగులుగా గుర్తించాలి"

– రాష్ట్ర మరుగుజ్జుల సంఘం

"**అణుకార్యక్రమాలను** విడనాడవలసిందిగా ఇతరులపై వత్తిడి తెస్తున్న కొన్నిదేశాలు మరోవైపు ఇజ్రాయిల్ సామూహిక జనహనన ఆయుధాలను కలిగిఉన్నప్పటికీ పట్టించుకోవడం లేదు. ఇజ్రాయిల్‌ను విమర్శించేవిషయంలో అంతర్జాతీయఅణుశక్తిసంస్థ వెనుకాడుతుంది"

– ఐక్యరాజ్యసమితి సర్వప్రతినిధి సభలో సౌదీ
అరేబియా–సిరియా–ఈజిప్ట్

"**దేశంలో** ఆర్.ఎం.పి.లు వాడుతున్న ఇంజెక్షన్ సూదుల ద్వారా వెదజల్లుతున్న కాలుష్యం ప్రమాదకర స్థాయిలో ఉంది. దేశంలో ప్రభుత్వ పాఠశాలల పరిస్థితి అధ్వాన్నంగా ఉంది. వారంలో ఒకరోజు మాత్రమే విధులకు హాజరవుతూ అన్నిరోజులు ఎగనామం పెట్టే ఉపాధ్యాయులు ఉన్నారు. పారిశుద్ధ్యం, విద్య, విద్యుత్‌వంటి రంగాలను ప్రైవేటీకరించి నంతమాత్రాన వాటిద్వారా ప్రజలకు అందే మౌళిక సేవలు మెరుగుపర్చవచ్చన్న అభిప్రాయం సరికాదు"

– ప్రపంచబ్యాంకు అభివృద్ధి నివేదిక 2003

"**గ్రామాలను** పరాధీనం చేసి రైతాంగాన్ని కట్టుబానిసలుగా మార్చేస్తున్న పాలకుల వ్యవసాయ విధానాలను ప్రతిఘటించాలి"

– ఎస్.సి., ఎస్.టి. జాతీయ కమీషన్ మాజీ ఛైర్మన్ రిటైర్డు
ఐ.ఎ.ఎస్.అధికారి బి.డి.శర్మ

"**ఇజ్రాయిల్‌ను** ఓ దేశంగా గుర్తించిన తొలి పాలస్తీనా నాయకుడు అరాఫత్. నోబెల్ శాంతిబహుమతికి పాలస్తీనా అధినేత యాసర్ అరాఫత్ నూటికి నూరుపాళ్ళు అర్హుడు"

– ఇజ్రాయిల్ మాజీ ప్రధాని షిమాన్ పెరస్

"**మార్కెట్‌లో** ఆదరణ పొందిన టాల్కమ్ పౌడర్లలో రాతినార (ఆస్‌బెస్టాస్) పొడి వుండే అవకాశం వుంది. ఇది అలర్జీని కలిగించి చర్మవ్యాధులకు, తెల్లమచ్చలకు దారితీస్తుంది"

– ఇండస్ట్రియల్ టాక్సికాలజీ రీసెర్చ్ సెంటర్ డైరెక్టర్ వై.కె. గుప్తా

"**అవినీతిలో** దేశంలో 'ఆంధ్రప్రదేశ్ అగ్రస్థానంలో ఉంది"

– సెంట్రల్ విజిలెన్స్ కమిషనర్ డైరెక్టర్ శాస్త్రి

"**అత్యాచారానికి** పాల్పడిన నిందితులకు మరణశిక్షవిధించడం అనర్థ దాయకం. తానుచేసిననేరానికి మరణదండన తప్పదన్న ఉద్దేశంతో సాక్ష్యమనేదేలేకుండా బాధితమహిళను హత్యచేసేందుకు దారితీస్తుంది"

– జస్టిస్ మాలిమత్
(న్యాయవ్యవస్థలో సంస్కరణల కమిటీ మెంబర్

# 'మతసామరస్యానికి ప్రాణాలైనా అర్పిస్తా' - ముఖ్యమంత్రి
## - మతతత్వ బిజెపితో బంధాన్ని విడనాడితే అదేచాలు.

**'రాష్ట్రాన్ని మాఫియాలకు అప్పగిస్తున్న బాబు' - డి.శ్రీనివాస్**

- శ్రీనివాస్‌గారు కాస్త వెనక్కితిరిగి చూసుకోండి

**'కుంభకోణాంధ్రగా రాష్ట్రం' - లక్ష్మిపార్వతి**

- మన రాష్ట్రానికి ఇలాంటి పేర్లెన్నింటికో అవకాశం కల్పించిన బాబు అభినందనీయులు. ఈ విషయంలో రాష్ట్రమే ఫస్ట్.

**'ఇజ్రాయిల్‌తో ఒప్పందాలు చేసుకున్నా, బోలెడంత నేర్చుకున్నా' - ముఖ్యమంత్రి**

- మన మంత్రుల్ని, అధికారుల్ని డెలిగేషన్లుగా పంపితే ఇంకా బోలెడంత నేర్చుకొనివస్తారు. మనరాష్ట్రం ఇంకా బోలెడంత బాగుపడిపోతుంది.

**'వ్యవసాయ పరిశోధనకు తగ్గిన నిధులు' - ఐఅర్‌ఆర్‌ఐ డైరెక్టర్ జనరల్**

- విదేశాల నుంచి పరిశోధనా ఫలితాలను తెచ్చుకోవడటం మన సాంప్రదాయం.

**'ఆర్థికాభివృద్ధిలో వర్థమాన దేశాలకు ఊపు' - ప్రపంచబ్యాంకు అధ్యక్షుడు వుల్ఫెన్సన్**

- ఎనిమిది సంవత్సరాలుగా తమరు మారాష్ట్రంలో అడుగుపెట్టిన తర్వాత భూతద్దం పెట్టుకొని ఆ అభివృద్ధి కోసం వెతుకుతున్నాం.

**'అసెంబ్లీకి గట్టి బందోబస్తు' - వార్త**

- అవునుమరి, ఏదైనా జరిగితే, ఇలాంటి "ప్రజా"నాయకులు మళ్లీ దొరుకుతారా?

**'20 వేల గ్రామాల్లో విజ్ఞాన కేంద్రాలు-పత్రికలు, పుస్తకాలు, ఇంటర్‌నెట్ వగైరా-పాఠశాల విద్యాశాఖ నిర్ణయం'**

- ముందు బిల్డింగుల సంగతి చూడండి. అలాగే కరెంటు సరఫరా కూడా చూడండి.

**'నిజామాబాద్ సంక్షేమ వసతిగృహంలో వార్డెన్ వీరంగం' - వార్త**

- ఆయనకు ముఖ్యమంత్రి రోల్ మోడల్ కాబోలు.

**'చైనాలో కమ్యూనిజం అధికారంలో వున్నా...' - న్యాయాధికారాల సభలో ముఖ్యమంత్రి**

- అదిగో, మళ్ళీ అదేమాట 'అక్కడున్నది కేవలం మార్కెట్ సోషలిజం మాత్రమే' అని తమరేగా అన్నదీ...

**'పెండింగ్ కేసుల్లో రాజధానే ఫస్ట్' - వార్త**

- అన్నింట్లో ఫస్ట్ ఉండాలనేగా మన ముఖ్యమంత్రి లక్ష్యం

**'నీటి రాజకీయాలకు పాల్పడితే కఠినచర్యలు' - ముఖ్యమంత్రి**

- నిన్నటిదాకా కర్నాటకతో రాజకీయం చేసింది తమరేగా! మిమ్మల్ని ఎవరు శిక్షించాలి?

**'రాష్ట్రం ధర్మపురి జాగీరా' - దేశం నేతల ధ్వజం**

- ఆయన జాగీరో కాదోగాని రాష్ట్రమేకాదు, తెలుగుదేశంపార్టీ కూడా చంద్రబాబు జాగీరు.

**'నక్సలైట్లు హింస విడనాడితే వారితో చర్చలకు సిద్ధం' - అద్వానీ**

- సరిగ్గా వాళ్ళూ అదే అంటున్నారు. ఇంకా చెప్పాలంటే హింసను తాత్కాలికంగానైనా ఆపమంటున్నారు.

**'కాంగ్రెస్ పచ్చి మతతత్వ పార్టీ' - జార్జి ఫెర్నాండెజ్**

- బిజెపితో అంటకాగిన తర్వాత ఆయనకు పచ్చకామెర్లు వచ్చినవాడికి ప్రపంచమంతా పచ్చగా కనిపించినట్లన్నట్లుంది.

**'ఇక పెట్టుబడులు పెరుగుతాయి' - విజయవాడకు విమాన సర్వీస్ ప్రారంభ సభలో ముఖ్యమంత్రి**

- అదేమోకాని ప్రారంభం కాకముందే విమానంలో మంటలు లేచాయి.

**'పట్టపగలే 'స్టార్'లను చూడండి' - ఇండేన్ గాస్ అడ్వర్‌టైజ్‌మెంట్**

- రాష్ట్రంలో పేదలందరూ చుక్కలు చూస్తూనేవున్నారు కదా.

**'కోటి 30 లక్షలమంది వ్యవసాయ కూలీలకు, 80 లక్షలమంది సన్న చిన్నకారు రైతులకు ఉపాధి కల్పించాల్సిన అవసరం వుంది' - కరువుపై చర్చకు సమాధానమిస్తూ ముఖ్యమంత్రి**

- అదేమిటి? పేదరికం రేఖకింద 11 శాతమందే ఉన్నారు గదా. మరి ఉపాధి ఇంతమందికి ఎందుకు కల్పించాల్సివస్తుంది?

# ప్రమాదపుటంచుల్లో ప్రజాజీవనం!

— ఎస్. సుధాకర్

**తెలుగునేలపై** కొనసాగుతున్న రెండు ప్రధాన రాజకీయ స్రవంతుల అత్యుత్సాహం, అవగాహనారాహిత్యం రాష్ట్రవ్యాప్తంగా జనజీవనాన్ని అల్లకల్లోలం చేస్తోంది. పాతతరాల వృద్ధనాయకుల్ని కాలదన్ని నవతరపు యువనాయకత్వానికి ప్రతీకలుగా ముందుకొచ్చిన వ్యక్తులు, శక్తులు రెండు రాజకీయ స్రవంతులకు ఉన్నతస్థాయిలో నాయకత్వ బాధ్యతలని ప్రారంభంలో ఎన్నో ఆశల్నీ, ఆకాంక్షల్నీ రేకెత్తించింది. కాలం గడుస్తున్నకొద్దీ ఆ ఆశలు, ఆకాంక్షలు వంచనకు గురికావడం ఆందోళన కలిగించే అంశం. కోటానుకోట్ల నోట్ల పథకాలతో 'ఓట్లే' పరమావధిగా కొనసాగుతున్న పార్లీమెంటరీ రాజకీయ స్రవంతి ఒకటైతే–ప్రజలు, ప్రజల బాగోగులే పరమావధిగా ఎంచి సాయుధ విప్లవంగా కొనసాగుతున్న నక్సల్‌బరీ రాజకీయ స్రవంతి మరొకటి. రెండు స్రవంతులూ ఆచరణలో అదుపుతప్పి అతిగా ప్రవర్తించడం దైనందిన జనజీవనాన్ని రక్తసిక్తం చేస్తోంది.

ఆత్మహత్యలు, ఆకలిచావులు, అకాల మరణాలు, వరకట్న హత్యలు, ప్రమాద మరణాలు కాకుండా గత పదిరోజుల్లో (జూన్ 15 నుంచి 26 వరకూ) రాష్ట్రవ్యాప్తంగా ఒకరినొకరు నరుక్కోవడాలూ, కాల్చిచంపుకోవడం వంటి సంఘటనల్లో యాభైమందికి పైగా మరణించడం జరిగింది. ప్రధాన దినపత్రికల పతాకశీర్షికల్లో వెలుగు చూసిన వివరాలే యాభై దాటితే వెలుగుచూడని శవాల సంఖ్య ఇంకెంతుందో చెప్పలేం. చట్టబద్ధమైన పాలన, అభివృద్ధి, శాంతి భద్రతలను పెంపొందించి రాజ్యాంగంపై విశ్వాసంతో కూడుకున్న గౌరవాన్ని ప్రజల్లో పెంపొందిచాల్సిన మంత్రులు, ముఖ్యమంత్రి స్థాయి నాయకులే 'తరమండి, చంపండి, నరకండి' అని ప్రజల్ని ఒకరిపైకి ఒకరిని ఉసిగొల్పుతూ అలాంటి 'చర్యలకు' పెద్దమొత్తంలో బహుమానాల్ని కూడా ప్రకటిస్తే వాటి పరిణామాలెలా ఉంటాయో, అలాంటి సమాజం ఎటువైపుగా పయనిస్తుందో ఊహించడం పెద్ద కష్టంకాదు. మరోవైపు ప్రజలే చరిత్రనిర్మాతలని భావించి ప్రాణాలతో సహా తమ సర్వస్వాన్ని ప్రజలకంకితం చేస్తూ చైతన్యపూరితమైన సామాజిక స్పృహ, ఉన్నతమైన జీవన ప్రమాణాలతో ప్రజలకు ప్రత్యామ్నాయ రాజకీయ వ్యవస్థను ప్రమాణం చేస్తూ ముందుకొచ్చిన విప్లవోద్యమ నాయకత్వాలు అన్ని దారుల్నీ 'ఆయుధాలకే' పరిమితం చేయడం, ఆయుధాలవేటలో అడ్డమొచ్చినవారినిహతమార్చడమన్నది మరింత ఆందోళన కలిగించే అంశం.

రాష్ట్రంలో ఇటీవల జరిగిన రెండు హింసాత్మకఘటనలను పౌర ప్రజాస్వామ్యవాదులు, మేధావులు, రాజకీయపార్టీల నాయకులు లోతుగా పరిశీలించాల్సిన అవసరం ఉంది. కడపజిల్లా రాయచోటి పరిసరాల్లో జరిగినట్టుగా చెబుతున్న ఒక ఎన్‌కౌంటర్‌కు సాక్షులుగా మిగిలిపోతారన్న భయంతో ఇద్దరు పశువుల కాపరులను పోలీసులు కాల్చిచంపడం ఒకటైతే, అనంతపురంజిల్లాలో ఎం.ఎల్.ఏ.శారదాంబ జనచైతన్య యాత్రపై ఆయుధాలకోసం దాడిచేసి అడ్డువచ్చిన గ్రామస్తులను పీపుల్స్‌వార్ కాల్చిచంపడం రెండవది. వేసవికాలంలో పశుగ్రాసాలు అడుగంటితే మూగజీవాల్ని కాపాడుకోవడానికి గ్రామస్తులు దట్టమైన అడవుల్లో వారాలు, నెలలు గడపడం అనాదిగా వస్తున్న ఒక జీవన ఆచారం. అలాగే గ్రామంలోకి ఏ పార్టీ నాయకు లొచ్చినా వారితో తమగోడు వెళ్ళబోసుకోవడం కూడా గ్రామస్తులకు అలవాటే. పై రెండు ఘటనల్లోనూ ఎలాంటి ముందస్తు హెచ్చరికలు గానీ, ప్రకటనలు గానీ లేకుండా సాధారణ జనజీవనాన్ని గడుపుతున్న ప్రజల్ని హతమార్చడమన్నది అప్రజాస్వామిక చర్యేకాక, అరాచకం కూడా. ఏసమస్యనైనా పరిష్కరించుకునేక్రమంలో సామ, దాన, భేద, దండోపాయాలన్నవి ఆచరణలో అనాదిగా కొనసాగుతున్న ఆచారాలే గాక అదొక శాస్త్రీయ పద్ధతిగా కూడా పెంపొందింది. ముందస్తు హెచ్చరికలతో తప్పునుదిద్దుకునే అవకాశం ఎదుటివారికి ఇచ్చినట్లవు తుంది. అది కనీస బాధ్యత. అలాగే సమస్యను ఒక 'చర్చ' ద్వారా పరిష్కరించుకోవడానికి అవకాశం ఉన్నచోట 'చర్చ'ను ప్రతిపాదించడ మనేది ఒక సర్దుబాటుకు అవకాశం కల్పించడమవుతుంది. ఉన్నత సమాజ స్థాపనకు పోరాడుతున్నామని చెబుతున్న నక్సలైట్లు కనీస

హెచ్చరికలు కూడా లేకుండా మనుషుల్ని కాల్చిచంపడమన్నది అరాచకంగానే మిగిలిపోతుంది. ప్రభుత్వం ఒకఉద్యమాన్ని సామాజిక సమస్యగా గుర్తించినపుడు ఆ సమస్య పరిష్కారానికి ఉద్యమ నాయకత్వంతో 'చర్చ'కు ఉపక్రమించడమన్నదికూడా కనీస రాజనీతి. ఎలాంటి చర్చా లేకుండా ఆ ఉద్యమాన్ని ఉద్యమ నాయకత్వాన్ని నిర్మూలించ పూనుకోవడం పూర్తిగా అరాజకీయమనే అనిపించు కుంటుంది. ఏ సమాజంలోనూ ఎలాంటి సమస్యల పరిష్కారానికైనా, సామాజిక మార్పులకైనా 'ఆయుధాల్ని' ఉపయోగించడమే ప్రధాన పరిష్కార మార్గం కాకూడదు.

ఆయుధాలకు ప్రత్యేకంగా ఒకభాషంటూ ఉండదు. పాతకాలపు దొరలైనా, పటేల్ పట్వారీలైనా, నేటిపోలీసులైనా, అన్నలైనా యజమాని భాషే ఆయుధం భాషగా ఉంటుంది. సమాజాన్ని శాసించి, దండించి దోచుకోవాలనుకున్నవారికి ఆయుధం సర్వస్వం అవుతుంది. ఉన్నత ప్రమాణాలతో కూడిన సమాజ పరిణామక్రమానికి తనవంతు పాత్ర నిర్వహించాలనుకున్నవారికికూడా ఒకఆయుధం అనివార్యమనుకుంటే అది కేవలం ఒకఆసరాగా నిలబడుతుందనుకున్నప్పుడు ప్రజలు దాన్ని ముద్దాడుతారు. భుజాలపైమోస్తారు. ఆయుధం తమనుశాసిస్తోందను కుంటే ప్రజలు తిరగబడతారు. ఆయుధాలకు ఎదురొడ్డిపోరాడుతారు. దొరలైనా, పోలీసులైనా, అన్నలైనా ఇందులో ఎలాంటి మినహా యింపులూ ఉండవు. ఆయుధం కలిగినవాడి భాష, ఆ భాష వెనుక దాగిన భావాలే ముఖ్యం.

దాచుకున్నడబ్బును దోచుకుంటున్న దోపిడీదొంగల్ని, అభివృద్ధికి ఆటంకం కలిగిస్తున్న నక్సలైట్లను అదిమిచంపండి అని రాష్ట్ర ముఖ్యమంత్రిస్థాయి నాయకుడు పిలుపునివ్వడం-'చట్టంకన్నా న్యాయం గొప్పది, న్యాయంకన్నా ధర్మం గొప్పది' అన్నంత లాజికల్‌గా ప్రారంభంలో చాలా గొప్పదిగానే కనిపిస్తుంది. అలా ఉత్తేజం పొందిన ప్రజలు అంతటితో ఊరుకుంటారనుకుంటే అంతకన్నా అమాయకత్వం మరొకటి ఉండదు. వాళ్ళకు న్యాయం, ధర్మం అనిపించిన ప్రతిచోటా చట్టాన్ని ఉల్లంఘించడం ప్రారంభిస్తారు. వాళ్ళ అభివృద్ధికి ఆటంకం అనుకున్న ప్రతి మనిషినీ చంపడానికి ఇనుమడించిన ఉత్సాహంతో ముందుకొస్తారు. ప్రస్తుతం ముఠాకక్షల పేరుతో గ్రామాల్లో కొనసాగుతున్న హత్యలకు అలాంటి ప్రకటనలు ప్రేరణగా నిలుస్తాయనడంలో ఎలాంటి సందేహమూ ఉండనక్కర్లేదు. పాలకవర్గ రాజకీయ నాయకులెప్పుడూ ప్రజలు తాము కోరుకున్న మేరకే చైతన్యవంతం కావాలనీ, తాము అనుకున్న పద్ధతిల్లోనే ప్రతిస్పందించాలనీ కోరుకుంటూ, వాస్తవంలో అలానే జరుగు తుందనే నమ్మకాన్ని సమాజంలో కలిగించే ప్రయత్నం చేస్తూంటారు. అలా నమ్మించకపోతే వాళ్ళ మనుగడే ప్రశ్నార్థకం అయిపోతుంది. ప్రతిపక్షాల ప్రజాప్రస్థాన పాదయాత్రల్లోనూ, పాలకపక్షాల చైతన్య యాత్రల్లోనూ ప్రజలు చైతన్యం కావాలని పిలుపునిస్తారు. ఆ చైతన్యం 'ఓట్లు'గా మారే చైతన్యం వరకే పరిమితం కావాలని కోరుకుంటారు. కానీ, ప్రజలు ఒకసారి చైతన్యం కావడం అన్నది ప్రారంభమైందంటే అది ఓట్లకే పరిమితంకాదు. ఓట్లు వచ్చేదాకా ఆగదు కూడా. నిన్నగాక మొన్న చేవెళ్ళలో జరిగిన రైతులనిరసన, రాష్ట్రవ్యాప్తంగా పెరుగుతున్న అసంతృప్తీ ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి. ఇక నక్సలైట్ ఉద్యమ నాయకత్వం ప్రబోధిస్తున్న చైతన్యానికి కూడా ఇదే వర్తిస్తుంది. ప్రజల బోగోగుల కొరకు ఆయుధాలు ఆసరా అనుకున్నంతకాలం వాళ్ళు ప్రజల దృష్టిలో దేవుళ్ళతో సమానం. వాళ్ళను కాపాడుకోవడానికి ప్రజలు ఎలాంటి త్యాగాలకైనా సిద్ధపడతారు. విచక్షణ కోల్పోయిన ఆయుధాలు అన్నలవైనా, పోలీసులవైనా ప్రజలు తీర్పులో పెద్ద మార్పేమీ ఉండదన్న విషయాన్ని ఇప్పటికైనా ఆయా వ్యక్తులు, శక్తులు గుర్తించగలిగితే రాష్ట్రవ్యాప్తంగా జనజీవనంపై కొనసాగుతున్న హింసాకాండ కొంతైనా తగ్గించినవారుగా మిగులుతారు.

(ఆంధ్రజ్యోతి దినపత్రిక నుంచి)

**వీక్షణం** చందాదారులు కాగోరువారు 'సమతా పబ్లికేషన్స్' పేర రూ.120/-లను డి.డి.గా కింది అడ్రసుకు పంపించగలరు.
వి. హనుమంతరావు, ఇం.నెం. 8-3-898/22, రోడ్ నెం. 3, నాగార్జుననగర్, హైదరాబాద్ - 500 073.

Edited, Printed and Published by **V. Hanumantha Rao** for **Samata Publications** D.No. 8-3-898/22, Road No. 3, Nagarjuna Nagar, Hyderabad-73. Ph: 23748672
Designed & Printed at : Nutan Art Printers, Lakdi-ka-pool, Hyderabad.